

పంచతంత్రం

# సంధి-విగ్రహం

కర్త... విశ్వాత్ముల నరసింహమూర్తి









కరిరాజొక క్షణమాలోచించి - పిక్కబలముగల బంటును పిలిచి -




పరుగులు తీయుచు పోయిన ఏనుగు - అడవియంతటా కలయతిరిగెను.





















సంవత్సర చందా
రు. 12-0-0
విడిప్రతిక 4 అ.

సంపుటము 45
సంచిక 46
15-7-53

# సచిత్రవారపత్రిక

Founder : K. NAGESWARA RAO

విజయ ఆషాఢ శుద్ధ చవితి; బుధవారం



పులివేషం

ఫొటో: శ్రీ పి. శివరామరాజు, మద్రాసు.

# విషయానుక్రమణిక

ముఖచిత్రం:—"షోలే" హిందీ చిత్రంలో బీనారాయ్.





"కమ్మని దండలున్, సురటి గాడ్పులు,
వెన్నెలయుం, బరాగ పుం
జమ్మును, మంచి గందమును,
సన్నపు వల్వలు, సీధుపానముం,
దమ్మికొలంకు, మేడయును,
దామరపాత్ము, లనంగ నొప్పు భో
గమ్ములు, పుణ్యవంతులకు గాని
లభింప వటంద్రు వేసవిన్."

తా॥ కమ్మని సువాసనగల పూలదండలును, విసనకర్రలతో విసరుటవల్ల కలిగెడి చల్లని గాలియును, వెన్నెల సౌఖ్యమును, పూవులనుండి రాలిన పొడియున్నూ, మంచి గంధమున్నూ, సన్నని వస్త్రములును, మద్యమున్నూ, తామరపూలు గల కొలనున్నూ, మేడయున్నూ, కమలములవంటి నేత్రములుగల స్త్రీలున్నూ, యీవిధములైన భోగసాధనములు వేసవి కాలములో పుణ్యం చేసికొనినవారికే గాని యితరులకు లభింపవంటారు.

దివ్యమైన రమ్యహర్మ్యములను చూస్తూ వాటిప్రక్కనుండి నడిచిపోతూ ఉండేటటువంటి మార్గస్థులు, "ఆహా! యీ మేడలో నివసించే భాగ్యవంతుడు ఎంతటి పుణ్యాత్ముడో గదా!" అనుకుంటూపోవడం కలదు. బాగా మామిడిపళ్ళతో నిండి విరగ కాచిన అంటుమామిడితోటల ప్రక్కనుంచి నడచిపోతూ, "బలే తోట! చెట్టుకు బండెడు పండ్లు అన్నట్లుగా కాచింది. ఇటువంటిది ఒక్క తోట ఉంటే చాలు. కాలుమీద కాలు వేసికొని హాయిగా కూర్చోవచ్చు. ఈ తోట ఆసామీ ఎవరోగాని, పూర్వజన్మలో ఏదో సుకృతం చేసికొని ఉంటాడు" అని అతని భాగ్యభోగ్యముల మూలకారణం అతని పూర్వజన్మ పుణ్యమే అని సిద్ధాంతీకరిస్తూ ఉంటారు. కాని, యీవిధంగా ప్రతివిషయంలోనూ మనము ప్రస్తావించుచున్నామా ? లేదు. మనకు రైలు తప్పినరోజున (అనగా రైలు స్టేషనుకు ఆలస్యంగా వెళ్ళి రైలుతప్పిన రోజున) ఆరైలులో ఎందరో ఎక్కి తమ తమ ఊళ్లకు ప్రయాణాలుచేసి ఉంటారు. అయితే, ఆవిధంగా ఆనాడు ఆ రైలులో ప్రయాణంచేసి వెళ్లినవాళ్లందరూ పుణ్యాత్ములనిన్నీ, పూర్వజన్మలో సుకృతం చేసికొన్నారనిన్నీ, మనము మాత్రము పూర్వజన్మలో పుణ్యంచేసికో లేదనిన్నీ అందువల్లనే మనకు ఆరైలు అందక తప్పిపోయినదనిన్నీ భావిస్తామా ? లేదు. ఒక రైలుప్రయాణం తప్పిపోయినంతమాత్రమువ మనము పాపాత్ములం అవుతామా ? ఒకనికి ఒక రైలు అందినంతమాత్రాన అతడు పుణ్యాత్ముడవుతాడా? నిజమే. ఇంత స్వల్ప విషయానికి అంతపెద్ద మీమాంసచేయడం పరిహాసంగా ఉంటుంది. కాని, ఒక్క విషయం ఆలోచించండి. మద్రాసునుంచి బయలుదేరిన ఆరైలుబండి ఒంగోలు స్టేషను వద్ద ఒక ప్యాసెంజరు బండితో ఢీకొట్టుకొన్నదనిన్నీ చాలా జననష్టము కలిగినదనిన్నీ మరునాడు ఆంధ్రపత్రికలో ఒక వార్త రుద్రాక్షలంత అక్షరాలతో ప్రకటించారనుకోండి. (ప్రతిహతములైన రైళ్లు అప్రతిహతమగుగాక!) అటువంటి హృదయ విదారకమైన, మెయిలు విదారక [illegible] వార్తను చదివినప్పుడు, మనకు కలిగే భావం ఏమిటి? ఆ రైలు మనకు తప్పిపోవడం నిజంగా అదృష్టమే. ఆడవాళ్ళతోనూ పిల్లలతోనూ ప్రయాణము కావడంలో, సామాన్లు సర్దుకోవడంలో, చాకలివాని యింటికి వెళ్ళి బట్టలు తెచ్చుకోవడంలో, ఆనాడు చాలా ఆలస్యమైనది. ఆడవాళ్లు చేసిన ఆలస్యానికి ఆడవాళ్ళను అనేక విధాల ఆ గృహస్థు ఆనాడు చీవాట్లు పెట్టి చీకాకుపడ్డాడు. ఇంట్లో స్త్రీల ఆలస్యం కంటె ఇస్త్రీచాకలి మూలంగా తన కుమారుడు చేసిన ఆలస్యానికి ఆ గృహస్థునకు వచ్చిన కోపం వస్త్రాపహరణం జరిగిన నాడు ద్రౌపదీదేవికి కూడా రాలేదు. పైగా తేనేం? ఆనాడు రైలు తప్పడం తన

కర్మం అని ఊరుకొన్నాడు. తన ఇంట్లో ఉన్న గడియారంలోని టైమును నమ్ముకొని దానిప్రకారంగా ప్రయాణమైనందుకు తనకీ ప్రాయశ్చిత్తం జరిగిందని తీర్మానించాడు. తన రైలు తప్పటకున్నూ, ఆశాభంగానికిన్నీ, అంతటికీ ఆ గోడగడియారమే మూలకారణమని ఎంచి, దానిని శపించాడు. తనకు సంభవించిన దురవస్థ కంతటికీ జవాబుదారీ అంతా దానిదే అని ఆ బాధ్యత అంతా ఆగోడ గడియారము (క్లాక్)నకు తగిలించివాడు. అన్నింటికీ పాపాల భైరవుడు దే అన్నట్టుగా "క్లాకుభైరవం భజే!" అని, దాని భరతంపట్టించాలి అన్నట్లుగా, దానికి దిట్టంగా కోపం కొద్దీ కీయిచ్చి, దాని వ్యాధికి మందు యివ్యాలన్నట్లుగా దానిలోని టైము అరగంట ఎక్కువగా ముందుకు జర్చి, ముళ్లు సవరించి, ములుకోలతో "ఛో! ఛో!" అని పొడిచినట్లుగా, కాలభైరవుణ్ని "ఇనూ్క!" అన్నట్లుగా, క్లాకుభైరవుణ్ని కూడా పరుగెత్తుమని ఉసికొల్పాడు.

ఆనాడు ఆ గృహస్థు ఎవరిమీద ఎంత చీకాకుపడ్డాడో గాని, రైలు తప్పినందుకుగాను మతితప్పినంత పనిఅయింది. కాని, మరునాడు నిద్రలేచి రైలుప్రమాదం జరిగిన వార్త విన్నాడు. ఆ రైలుప్రమాదం తనకు తప్పినందుకు బ్రహ్మానందపరవశుడైనాడు. తన పూర్వజన్మపుణ్యవిశేషం మూలంగానే తనకూ తన భార్యకూ తనబిడ్డలకూ నిన్న రైలు తప్పినదనిన్నీ, ఇదంతా భగవంతుని చిద్విలాసం తప్ప మరొకటి కాదనిన్నీ, తన భార్యతో అన్నాడు. దీని అర్థంఏమిటి? రైలుతప్పకుండా క్రిందటిరోజున రైలుకు సకాలానికి వెళ్లి ప్రయాణం చేయగల్గిన వాళ్లందరూ దురదృష్టవంతులు.

పూర్వజన్మలో ఏదో మహాపాపం చేసుకొన్నారు. అందువల్లనే అటువంటి రైలుప్రయాణంలో దిక్కు మొక్కు లేక దారిమార్గంలో దుర్మరణంపాలై, హరీ!అన్నారు. ఈవిధంగా రైళ్లు ఢీ కొట్టుకొని తలక్రిందులై పోవడంవల్ల, ఆరైలు తప్పిన గృహస్థుయొక్క క్రిందటిరోజు భావాలన్నీ పనికిమాలిన భావాలై మరునాటికి చద్దికంపు కొట్టినట్లుగా నిషిద్ధభావాలైనాయి. అతని నిన్నటి పాతభావాల రైలుతో, నేటి కొత్త భావాల రైలు ఢీకొట్టుకొని, పాతభావాల రైలు తలక్రిందులైనట్లుగా భావచక్రాలు క్రిందుమీదైనాయి.

దీనికంతటికీ కారణమేమిటంటే, మనకు కోరికలు చాలా ఉన్నాయి. మెడలో మల్లెపూలదండలు వేసుకోవాలి. గరం గరం తాజామాల్ పకోడీలు తిని, సిల్కు చీరె కట్టిన కుల్కులాడితో బజారులో తిరిగి, చీకటిపడే వేళకు సినిమాకు యిద్దరూ వెళ్ళి, ఆ చీకట్లో కన్పించే తారలు (నక్షత్రాలు) కూడా ఏవిధంగా యథేచ్ఛావిహారం చేస్తున్నాయో శ్రద్ధగా గమనించి, ఆనాటికి మస్తుగా చుత్తుగా తాగి, చేతిలోని పైసా అయిపోయిన తర్వాత,



మహిషాసుర మర్దనం

మహాబలిపురంలో కుడ్యశిల్పం.

# ★ కాలక్షేపం ★

పర్వు ఉత్తరి అయినతర్వాత, ఉల్కవలె, ఆ ప్రణయతారాపథంలోనుంచి, ఆ ఊహా ప్రపంచంలోనుంచి రాలి పడిపోతారు. కాని, యీవిధంగా తిరిగేటటువంటి విలాస విలాసినులను చూచినటువంటి జనులు కొందరు "ఆహా! ఎంతటి అదృష్టవంతులోగదా వాళ్ళు! హాయిగా వండని అన్నమూ వడకని బట్ట అన్నట్టుగా, వాళ్లు దొరా దొరసానులు లాగున షికార్లు చేస్తున్నారు" అంటూ వారిని వంక చూచి, తల యూచి, తమిరేచి, యీ అందజాలని పండ్లకొరకై అర్రుజాచిన వెర్రివలె, తమ జీవితము రోసి, యీ తమకముచే తికమక పడేవాళ్ళు చాలామంది ఉన్నారు. ఇవన్నీ ఈ జీవితంలో, ఈ సంసారంలో కలిగే భ్రమలన్నారు పండితులు. మతి భ్రమణాలన్నారు మరింత తెలిసిన పండితులు.

కాని ఒక్క విషయం గమనించాలి. చల్లని పానీయంగాని, తియ్యని షర్బత్తుగాని త్రాగవలెనన్నే కోరిక ఉండడం అపచారమా? గ్రహచారమా? దాహం అనేది దేహంఉన్న ప్రతి జీవికీ ఉంటుంది. కనుక అది సహజలక్షణం — సజీవలక్షణం - కనుక, తృష్ణ అనేది దేహంలో ఉష్ణం ఉన్నంత కాలమూ ఉండకతప్పదు. దాహంతీరుట కొరకై చల్లని పానీయం త్రాగుటలో తప్పులేదు. కాని, దాహం లేకపోయినప్పటికీ, సోడాషాపు కన్పించినప్పుడెల్ల దానికి దాసోహం అన్నట్లుగా దాహం త్రాగడం, దురభ్యాసం - మసీదు దగ్గరకు రాగానే బ్యాండు మేళం సన్నాయి మేళం ఆగిపోయినట్లుగా, కాఫీహోటలు రాగానే కొందరికి కాళ్లబండి కదలకుండా ఆగిపోతుంది. కాఫీ ఒక కప్పు త్రాగివస్తానని లోపలికివెళ్తారు. వీళ్ళందరూ కాఫిర్లే కావచ్చు. మసీదులలోకి పోవట్టి కాఫిర్లు కాఫీహోటల్సులోకి వెళ్లి పెట్రోలుఎక్కించినట్లుగా పొట్టనిండా ఎక్కిస్తారు. గ్యాలను పెట్రోలుకు పదిమైళ్లు కూడా నడువని మోటారు కార్లు ఉన్నాయి. అంటే అర్థం ఏమిటి?

పట్టుమని పదిమైళ్లునడిచేసరికి తిరిగి పెట్రోలు ఎక్కించాలి. లేకపోతే. ఆకారు నడవదు. అటువంటికార్లకు తృష్ణఎక్కువ. అటువంటికార్లు పనికిమాలిన వంటారా? ప్రశస్తమైన వంటారా? ఎందుకీ వెధవకారు అని వేలంపాడినా కొనేవాళ్ళుఉండరు. అదేవిధంగా వీలం వెర్రిగా పానీయంగాని చిరుతిండిగాని పొట్టలోవేస్తూ "జుహోమి స్వాహా!" అనే తృష్ణాగ్నిహోత్రావధానులు చాలామంది ఉన్నారు. అటువంటి తృష్ణచేత వారు అడుగుతీసి అడుగు వేయలేని అధోగతిలోనికి క్రమేణ వస్తారు. అట్టివారు "దాహం" అంటే "దాసోహం" అంటారు. త్రాగుడు ఎక్కువైన కొద్దీ, "పీత్వా పీత్వా పునఃపీత్వా" అనే వామాచారులవుతారు.

"భోగము" అనేది ప్రత్యేకంగా భోగం వీధిలో అమ్మబడే వస్తువుకాదు. సంసారుల బజారులోకూడా ఆ సరకు సమృద్ధిగా కన్పిస్తోంది. ఆకలికోసం, దేహారోగ్యం కోసం, తినేది అన్నం. బుట్టనిండా' బూరెలున్నవి గదా అని పొట్టనిండా మెక్కడం కేవలం బూరెల మీద మోహం. అది జిహ్వాచాపల్యం - చిత్తచాపల్యం. దేహధారణకోసం తినేది ఆహారం - ఖుషీకోసం తినేది విషం. మితం తప్పితే "భోగం" "రోగం."

అన్నీ సమృద్ధిగా ఉన్న సాహుకారు అహోరాత్రాలు హాయిగా అనుభవిస్తాడు - ఉన్నవి గనుక తిన్నాడు. తినవలెను గనుక తినలేదు. అష్టయిశ్వర్యాలతో తులతూగుతున్నాడు గనుక అష్టమహిషీ కల్యాణం చేసికొన్నాడు. 'లేదు' అనే మాట లేదు గనుక, చేదెక్కేవరకు గారెలు తిన్నాడు. గుండె ఆగేవరకు గిండీ గుర్రం లాగున సవారీ చేస్తాడు. ఆహార నిద్రా భయము లంటే నిర్భయం. "అధరం మధురం", "వదనం మధురం" అని నిరంతరం భ్రమరంలాగున మధురంకోసం కన్పించిన పుష్పంమీద వ్రాలుతూ సంచరిస్తువట్లయితే, మధుదాహం ఎక్కువై, మధుమేహం ప్రవేశిస్తుంది. మితంగా తినేది ఆహారం - అది దేహాధారం. మితం తప్పినది విషం. అదే భోగం - అదే రోగం. శరీరం అతి సుకుమారం అయినప్పుడే వసంత కుసుమాకరం తులాలలెక్కను తినాలి. రాజభోగంవల్లనే రాచపుండు - దానికే రాజవైద్యులు కావాలి.

రాజభోగంగా జరగాలనిన్నీ, దేవేంద్రభోగం అనుభవించాలనిన్నీ కోరడమే స్వర్గానికి సోపానాలు నిర్మించడం. భారతదేశం భూతలస్వర్గం కావాలని కోరడమే, రాజ్యాంగపండితుల ఆదర్శరాజం -

అమెరికా చూడండి. అక్కడివాళ్లు డాలర్లలో దొర్లుతున్నారు. అమెరికా అంటే డోలర్ డోల. ఆదేశంలో కారులేని కార్మికుడు లేడు. పేటకొక సినిమాహాలు - పూటకొక ఫిల్ము. అక్కడి విమానాశ్రయాలలో

(54 వ పేజీ చూడండి)

కర్మం అని ఊరుకొన్నాడు. తన ఇంట్లో ఉన్న గడియారంలోని టైమును నమ్ముకొని దానిప్రకారంగా ప్రయాణమైనందుకు తనకీ ప్రాయశ్చిత్తం జరిగిందని తీర్మానించాడు. తన రైలు తప్పటకున్నూ, ఆశాభంగానికిన్నీ, అంతటికీ ఆ గోడగడియారమే మూలకారణమని ఎంచి, దానిని శపించాడు. తనకు సంభవించిన దురవస్థ కంతటికీ జవాబుదారీ అంతా దానిదే అని ఆ బాధ్యత అంతా ఆగోడ గడియారము (క్లాక్)నకు తగిలించినాడు. అన్నింటికీ పాపాల భైరవుడదే అన్నట్లుగా "క్లాకుభైరవం భజే!" అని, దాని భరతంపట్టించాలి అన్నట్లుగా, దానికి దిట్టంగా కోపం కొద్దీ కీయిచ్చి, దాని వ్యాధికి మందు యివ్వాలన్నట్లుగా దానిలోని టైము అరగంట ఎక్కువగా ముందుకు దిద్ది, ముల్లు సవరించి, ములుకోలతో "ఛా! ఛా!" అని పొడిచినట్లుగా, కాలభైరవుణ్ని "ఇస్కా!" అన్నట్లుగా, క్లాకుభైరవుణ్ని కూడా పరుగెత్తుమని ఉసికొల్పాడు.

ఆనాడు ఆ గృహస్థు ఎవరిమీద ఎంత చీకాకుపడ్డాడో గాని, రైలు తప్పినందుకు గాను మతి తప్పినంత పనిఅయింది. కాని, మరునాడు నిద్రలేచి రైలుప్రమాదం జరిగిన వార్త విన్నాడు. ఆ రైలుప్రమాదం తనకు తప్పినందుకు బ్రహ్మానందపరవశుడైనాడు. తన పూర్వజన్మపుణ్యవిశేషం మూలంగానే తనకూ తన భార్యకూ తనబిడ్డలకూ నిన్న రైలు తప్పినదనిన్నీ, ఇదంతా భగవంతుని చిద్విలాసం తప్ప మరొకటి కాదనిన్నీ, తన భార్యతో అన్నాడు. దీని అర్థంఏమిటి? రైలుతప్పకుండా క్రిందటిరోజున రైలుకు సకాలానికి వెళ్ళి ప్రయాణం చేయగల్గిన వాళ్ళందరూ దురదృష్టవంతులు.

పూర్వజన్మలో ఏదో మహాపాపం చేసుకొన్నారు. అందువల్లనే అటువంటి రైలు ప్రయాణంలో దిక్కు మొక్కు లేక దారి మార్గంలో దుర్మరణంపాలై, హరీ! అన్నారు. ఈవిధంగా రైళ్లు ఢీ కొట్టుకొని తలక్రిందులై పోవటంవల్ల, ఆరైలు తప్పిన గృహస్థుయొక్క క్రిందటిరోజు భావాలన్నీ పనికిమాలిన భావాలై మరునాటికి చద్దికంపు కొట్టినట్లుగా నిషిద్ధభావాలైనాయి. అతని నిన్నటి పాతభావాల రైలుతో, నేటి కొత్త భావాల రైలు ఢీకొట్టుకొని, పాతభావాల రైలు తలక్రిందులైనట్లుగా భావచక్రాలు క్రిందుమీదైనాయి.

దీనికంతటికీ కారణమేమిటంటే, మనకు కోరికలు చాలా ఉన్నాయి. మెడలో మల్లెపూలదండలు వేసుకోవాలి. గరం గరం తాజామాల్ పకోడీలు తిని, సిల్కు చీరె కట్టిన కులుకులాడితో బజారులో తిరిగి, చీకటిపడే వేళకు సినిమాకు యిద్దరూ వెళ్ళి, ఆ చీకట్లో కన్పించే తారలు (నక్షత్రాలు) కూడా వివిధంగా యథేచ్ఛావిహారం చేస్తున్నారో శ్రద్ధగా గమనించి, ఆనాటికి మస్తుగా మత్తుగా త్రాగి, చేతిలోని పైసా అయిపోయిన తర్వాత,



మహిషాసుర మర్దనం

మహాబలిపురంలో కుడ్యశిల్పం.

# ★ కాలక్షేపం ★

పర్సు ఉత్తరి అయినతర్వాత, ఉల్కవలె, ఆ ప్రణయతారాపథంలోనుంచి, ఆ ఊహా ప్రపంచంలోనుంచి రాలి పడిపోతారు. కాని, యీవిధంగా తిరిగేటటువంటి విలాస విలాసినులను చూచినటువంటి జనులు కొందరు "ఆహా! ఎంతటి అదృష్టవంతులోగదా వాళ్ళు! హాయిగా వండని అన్నమూ వడకని బట్ట అన్నట్టుగా, వాళ్లు దొరా దొరసానులు లాగున షికార్లు చేస్తున్నారు" అంటూ వారిని వంక చూచి, తల యూచి, తమిరేచి, యీ అందజాలని పండ్లకొరకై అర్రుజాచిన వెర్రివలె, తమ జీవితము రోసి, యీ తమకముచే తికమక పడేవాళ్ళు చాలామంది ఉన్నారు. ఇవన్నీ ఈ జీవితంలో, ఈ సంసారంలో కలిగే భ్రమలన్నారు పండితులు. మతి భ్రమణాలన్నారు మరింత తెలిసిన పండితులు.

కాని ఒక్క విషయం గమనించాలి. చల్లని పానీయంగాని, తియ్యని షర్బత్తుగాని త్రాగవలెననే కోరిక ఉండడం అపచారమా? గ్రహచారమా? దాహం అనేది దేహంఉన్న ప్రతి జీవికీ ఉంటుంది. కనుక అది సహజలక్షణం — సజీవలక్షణం - కనుక, తృష్ణ అనేది దేహంలో ఉష్ణం ఉన్నంత కాలమూ ఉండకతప్పదు. దాహంతీరుట కొరకై చల్లని పానీయం త్రాగుటలో తప్పులేదు. కాని, దాహం లేకపోయినప్పటికీ, సోడాషాపు కన్పించినప్పుడెల్ల దానికి దాసోహం అన్నట్లుగా దాహం త్రాగడం, దురభ్యాసం - మసీదు దగ్గరకు రాగానే బ్యాండు మేళం సన్నాయి మేళం ఆగిపోయినట్లుగా, కాఫీహోటలు రాగానే కొందరికి కాళ్లబండి కదలకుండా ఆగిపోతుంది. కాఫీ ఒక కప్పు త్రాగివస్తావని లోపలికివెళ్తారు. వీళ్ళందరూ కాఫిర్లే కావచ్చు. మసీదులలోకి పోవటి కాఫిర్లు కాఫీహోటల్సులోకి వెళ్లి పెట్రోలుఎక్కించినట్లుగా పొట్టనిండా ఎక్కిస్తారు. గ్యాలను పెట్రోలుకు పదిమైళ్లు కూడా నడువని మోటారుకార్లు ఉన్నాయి. అంటే అర్థం ఏమిటి?

పట్టుమని పదిమైళ్లనడిచేసరికి తిరిగి పెట్రోలు ఎక్కించాలి. లేకపోతే. ఆ కారు నడవదు. అటువంటికార్లకు తృష్ణఎక్కువ. అటువంటికార్లు పనికిమాలిన వంటారా? ప్రశస్తమైన వంటారా? ఎందుకీ వెధవకారు అని వేలంపాడినా కొనేవాళ్ళుఉండరు. అదేవిధంగా ఏలం వెర్రిగా పానీయంగాని చిరుతిండిగాని పొట్టలోవేస్తూ "జుహోమి స్వాహా!" అనే తృష్ణాగ్నిహోత్రావధానులు చాలామంది ఉన్నారు. అటువంటి తృష్ణచేత వారు అడుగుతీసి అడుగు వేయలేని అధోగతిలోనికి క్రమేణ వస్తారు. అట్టివారు "దాహం" అంటే "దాసోహం" అంటారు. త్రాగుడు ఎక్కువైన కొద్దీ, "పీత్వా పీత్వా పునఃపీత్వా "అనే వామాచారులవుతారు.

"భోగము" అనేది ప్రత్యేకంగా భోగం వీధిలో అమ్మబడే వస్తువుకాదు. సంసారుల బజారులోకూడా ఆ సరకు సమృద్ధిగా కన్పిస్తోంది. ఆకలికోసం, దేహారోగ్యంకోసం, తినేది అన్నం. బుట్టనిండా' బూరెలున్నవి గదా అని పొట్టనిండా మెక్కడం కేవలం బూరెలమీద మోహం. అది జిహ్వాచాపల్యం - చిత్తచాపల్యం. దేహధారణకోసం తినేది ఆహారం - ఖుషీకోసం తినేది విషం. మితం తప్పితే "భోగం" "రోగం."

అన్నీ సమృద్ధిగా ఉన్న సాహుకారు అహోరాత్రాలు హాయిగా అనుభవిస్తాడు - ఉన్నవి గనుక తిన్నాడు. తినవలెను గనుక తినలేదు. అష్టయిశ్వర్యాలతో తులతూగుతున్నాడు గనుక అష్టమహిషీ కల్యాణం చేసికొన్నాడు. 'లేదు' అనే మాట లేదు గనుక, చేదెక్కేవరకు గారెలు తిన్నాడు. గుండె ఆగేవరకు గిండీ గుర్రం లాగున సవారీ చేస్తాడు. ఆహార నిద్రా భయము లంటే నిర్భయం. "అధరం మధురం", "వదనం మధురం" అని నిరంతరం భ్రమరంలాగున మధురంకోసం కన్పించిన పుష్పంమీద వ్రాలుతూ సంచరిస్తూ వట్లయితే, మధుదాహం ఎక్కువై, మధుమేహం ప్రవేశిస్తుంది. మితంగా తినేది ఆహారం - అది దేహాధారం. మితం తప్పినది విషం. అదే భోగం - అదే రోగం. శరీరం అతి సుకుమారం అయినప్పుడే వసంత కుసుమాకరం తులాలలెక్కను తినాలి. రాజభోగంవల్లనే రాచపుండు - దానికి రాజవైద్యులు కావాలి.

రాజభోగంగా జరగాలనిన్నీ, దేవేంద్రభోగం అనుభవించాలనిన్నీ కోరడమే స్వర్గానికి సోపానాలు నిర్మించడం. భారత దేశం భూతలస్వర్గం కావాలని కోరడమే, రాజ్యాంగపండితుల ఆదర్శరాజం -

అమెరికా చూడండి. అక్కడివాళ్లు డాలర్లలో దొర్లుతున్నారు. అమెరికా అంటే డోలక్ డోల. ఆదేశంలో కారులేని కార్మికుడు లేడు. పేటకొక సినిమాహాలు - పూటకొక ఫిల్ము. అక్కడి విమానాశ్రయాలలో

(54 వ పేజీ చూడండి)

## పిల్లలకు ప్రత్యేకాకర్షణ

# కథలు, గేయాలు, చిత్రాల రచనలో

రాబోయే 'విజయదశమి' పండుగకు (1953 అక్టోబరు 17 వతేదీ) ఆంధ్రపత్రిక సచిత్ర వార పత్రిక పిల్లల ప్రత్యేక సంచికగా వెలువడుతుందని పాఠకులకు తెలుపడానికి ఆనందిస్తున్నాము. బాల బాలికలకు ఉల్లాసం, విజ్ఞానం కలిగించే చక్కని కథలు, గేయాలు, వ్యాసాలు, బొమ్మలతో పత్రిక ఆకర్షణీయంగా తయారవుతుంది.

బాల బాలికల రచనాశక్తిని, చిత్రలేఖనాశక్తిని ప్రోత్సహించడానికి గాను పోటీ పెడుతున్నాము. ఈ పోటీలో ఒక మంచికథకు, ఒక మంచిపాటకు, ఒక మంచిబొమ్మకు బహుమతులివ్వబడతాయి.

ఈ సందర్భంలో రచనలు, చిత్రాలు పంపదలిచేవారు ఈ క్రింది అంశాలను గుర్తుంచుకోవాలి.

* పదిహేనేళ్ళలోపు బాల బాలికలు మాత్రమే ఈపోటీలో పాల్గొనవచ్చును.
* కథలు, గేయాలు, బొమ్మలు స్వతంత్రమైనవై ఉండాలి.
* కథలు గేయాలు కాగితానికి ఒకేప్రక్క సిరాతో స్పష్టంగా వ్రాయాలి.

* బొమ్మలు రంగులలో కాని, రంగుకాగితం పైనకాని పెన్సిల్, సిరాలతో వ్రాసినవిగాని పనికిరావు. ఇండియన్ ఇంక్‌తో మాత్రమే వ్రాసిపంపాలి.

* రచనలు, బొమ్మలు 1953 సెప్టెంబరు 15 వ తేదీలోగా మాకు చేరేవిధంగా పంపాలి.
* రచయితలు చిత్రకారులు తమ పూర్తిపేరు (ఇంటిపేరు కూడా) వయస్సు, చిరునామా అన్నీ వివరంగా రచనలూ చిత్రాలతో పాటే వ్రాసి పంపాలి.

* స్వీకరించబడని రచనల్ని బొమ్మల్ని తిప్పి పంపాలని కోరేవారు చాలినంత స్టాంపుకూడా చేర్చి పంపాలి.

* కవర్లపైనా లేక రేపర్లపైనా "ఆంధ్రపత్రిక సచిత్ర వారపత్రిక దసరా పోటీకోసం" అని స్పష్టంగా వ్రాసినవి మాత్రమే పోటీకి స్వీకరించబడతాయి.

ముఖచిత్రానికి అవసరమైన రంగులబొమ్మలు కూడా స్వీకరించబడతాయి. వీనిని కూడా పదిహేనేళ్లలోపు బాల బాలికలే పైనియమాలకు లోబడి పంపాలి. కవరుపేజీకి స్వీకరించబడే చిత్రానికి ప్రత్యేక పారితోషికం ఇవ్వబడుతుంది. ఈచిత్రాన్ని మాత్రం ఆగష్టు 15 వ తేదీలోగా పంపాలి.

# నేటి మనిషి

ముందు ఎండలో పేవ్‌మెంట్ మీద విసురుగా నడచి వెడుతున్నాడు కనకం. అతని ముఖం చూస్తే దూరంగా దేన్నో ఆశించి వెడుతున్నట్టు, కలవరపడుతున్నట్టు తెలుస్తూంది. ఇటూ అటూ చూడకుండా దేన్నో అందుకుందామన్నట్లు కంగారుగా తిన్నగా వెళ్లిపోతున్నాడు. అతనిలో ఏ ఆలోచనా పని చేయడంలేదు. అంతకు ముందుగా తాను హోటల్‌లో కాఫీ త్రాగి అయ్యరుకు ఎంత ఇచ్చాడు? అరుకాణా బేడా? అరుకాణయితే ఫరవాలేదు. బేడైతే తిరిగి అర్ధణా ఇచ్చాడా? ఏమో లాల్చీ జేబు తడుముకున్నాడు. చేతికి సమాధానంగా అర్ధణా తగల్లేదు. తను ఇచ్చిందే అరుకాణేమో! అబ్బే బేడే ఇచ్చినట్లు జ్ఞాపకం, ఐతే అర్ధణా మోసం చేశాడా! వెధవ అర్ధణా. అసలు డబ్బులు మిగిలాయో లేదో అనే ఆలోచన ఎందుకు రావాలి తనకి? నడుస్తున్నంతసేపూ అదొక్క ఆలోచనే అతనిలో తీవ్రంగా పనిచేసి తిరిగి తిరిగి ప్రశ్నించింది. కనకం ఆలోచిస్తూనే నడుస్తున్నాడు.

అతనికి అర్ధణానుగురించి ఆలోచన రావటం అదే తొలిసారి. "అర్ధణానుగురించి ఆలోచించటమేమిటి"ని అతనికి సిగ్గేసింది. అంతకుముందెప్పుడూ అతనికి రూపాయికి తక్కువ ఆలోచనరాలేదు. అందువల్లే గబుక్కున ఒక్కసారిగా దిగిపోయేనేమిటని సిగ్గేసివుంటుంది. ఇప్పుడైనా తన ఆర్థిక స్థితి పూర్తిగా అనారోగ్యంగా ఉండడంచేత గాని కాకపోతే ఆ అర్ధణా గురించి ఆలోచించి ఉండకపోను. అయినా అతను ఆ అర్ధణాతో చేయవలసిన ఘనకార్యం కూడ ఏంలేదు. కాని ఉంటే ఎందుకైనా ఉపయోగపడునే, అని విచారించాడు. అతనికా ఆలోచన, విచారం చాలా నీచం అనిపించింది. కాకపోతే నెలకి నూటపది రూపాయలు తెచ్చుకుంటున్నాడాయె! సిగ్గుకాదు మరీ? పిల్లాపీచు లేదు. తనూ, పెళ్ళాం అంతే. మధ్య మధ్య మావగారు పాతికోపరకో పంపకపోతే గతి లేదన్నట్టు కూర్చుంటాడు. అడపాదడపా అన్నగారుకూడ అతనికి మనియార్డరు చేస్తూనే వుంటాడు. తనకన్న తక్కువ తెచ్చుకొనే మిత్రులదగ్గరికే ఎప్పుడూ అప్పుకి బయలుదేరతాడు. అదే అలవాటులో స్నేహితుడిదగ్గరికి బయలుదేరాడు. త్వరత్వరగా నడుస్తున్నాడు కనకం, ఏదో కొంపమునిగినవాడిలా. మూడు అణాలు వుంటే రిక్షా ఎక్కేవాడే. అతనికి ప్రస్తుతానికి అయిదురూపాయలైతే చాలు. కావలసిందీ, కోరదగ్గదీ ఇంకేం లేదు.

ఆవేళ ఆదివారం. కనకం, అతని భార్యా ఇంగ్లీషు ఫిల్ముకి వెళ్ళాలని గట్టిగా నిశ్చయించుకున్నారు. ఇంటివారి అమ్మాయి కూడా తమతో రావాలని సరదా పడుతున్నట్లు కనకం గ్రహించాడు. అతనికి జీతం అంది ఇంకా పదిరోజులైనా కాలేదు. అప్పుడే బయలుదేరాడు అప్పు తెచ్చుకోటానికి! ఇంత జీతం వస్తూంది, ఇంత ఖర్చవుతూంది అని ఎప్పుడూ అతను లెక్కవేయటానికి ప్రయత్నించలేదు. దానికి కారణం అతని కంతవరకూ ఏ నెలా మిగిలేటట్లు కనిపించకపోవడంవల్లె అయుండాలి. ఈ నెల ఇట్లా అయింది, మరుసటి నెల అయినా జాగ్రత్తగా వాడుకుందాం అని అతను ఎప్పుడూ పశ్చాత్తాపపడలేదు. అవసరానికి డబ్బు దొరకని పక్షంలో పశ్చాత్తాపపడేవాడేమో. అవసరానికి ఎప్పుడూ అతనికి అప్పు దొరుకుతూనేవుంది. అదే ఆశ సినిమాకు వెళ్లడానికి అయిదు రూపాయల కోసం మంచి ఎండలో స్నేహితుడింటికి మైలుదూరం నడిపించింది.

"కనక్ ప్రవాసి"

కనకం వీధిలో నిలబడే "సుబ్బారావ్! సుబ్బారావ్!" అని పిలిచాడు స్నేహితుణ్ణి. ఎవరూ పలకలేదు. కాస్సేపు ఆగి మళ్ళీ పిలిచాడు. ఎవరూ పలకలేదు. ఆ ఇంటికి తాళం వేసిఉండటం చూసి సిగ్గుపడుతూ విసుగ్గా అక్కడినుంచి బయలుదేరాడు. కనకానికి మంచి ఆలోచన తట్టింది. పోనీ రాజు నడిగితే! అంతకుముందే తను రాజుకి నాలుగుంపావలా ఇవ్వాల్సినమాట జ్ఞాపకం వచ్చింది. బాగుండదేమో అని సందేహించాడు.

"ఆఁ, బాగోకపోవడం ఏమిటి! అదీ, ఇదీ ఏకంగా ఒకేసారి కలిపి ఇవ్వచ్చు" అని సమాధానం చెప్పుకొని ధైర్యంగా రాజును పిల్చాడు. రాజు పెద్ద కొడుకు పన్నెండేళ్లవాడు కనకందగ్గరగా వచ్చి రహస్యంగా "మానాన్న చేతిలో లెఖ్ఖలేక మీదగ్గరకి వెడతానని చెప్పి వెళ్లారు. రాలేదా?" అని అడిగాడు. "రాలేదు" అనే చిన్న సమాధానంకోసం కనకం తడుముకున్నాడు. ఇదే సమయంలో తన దగ్గరకే రాజుకూడ బయల్దేరటమేమిటని కనకానికి పెద్దకోపం వచ్చింది. తన కియ్యాల్సివస్తుందని తనదగ్గరకే బయల్దేరాడా, అన్నట్లు ఫలయ్యాడు కనకం. నిజానికి కనకం ఎప్పుడూ ఇంత ఇబ్బందిపడలేదు. ఎప్పుడు అడిగినా వాళ్లు లేదనకుండా అతనికిచ్చేవారు. అతను ఎప్పుడూ అప్పులు తీర్చడం అలస్యమే! అయినా వాళ్లు సాధారణంగా అడిగేవాళ్లేకాదు. కనకానికి యిక ఒక్కటే ఆలోచన తట్టింది. భాస్కరాన్ని వెళ్లి అడిగితే—"తనతో మాట్లాడడం తగ్గించేసి తనదగ్గరకే అప్పుకోసం వెడితే ఏమనుకుంటాడో వాడు?" అని కనకం ముందు బాధపడ్డాడు.

"ఆఁ ఏమనుకుంటాడేం! తనతో మళ్ళీ బాగా మాట్లాడుతున్నాడే అని అది [illegible]ల పెట్టుకొనేందుకైనా వెంటనే ఐదూ ఇవ్వడూ!" అని నమ్మి బయలుదేరాడు.

కాని కనకం దురదృష్టమేమిటో, భాస్కరం ఊళ్లోలేడని అతని శ్రీమతి జవాబు చెప్పింది. సిగ్గు విడిచి, ధైర్యంగా ఆవిడనే ఒక్క అయిదురూపాయల నోటు బదులు అడుగుదామనుకున్నాడు. ధైర్యమైనవాడే. అడగ్గలడు. కాని అతనిలో ఏమూలో దాగివున్న మొగతనం పరిహసించింది. దాంతో తలవంచుకొని మరి చూడకుండా నడక సాగించాడు.

అయోమయంలో మందంగా నడుస్తున్నాడు కనకం. అవమానాన్ని అంటిపెట్టుకొని నడుస్తున్నాడు. అయిదురూపాయలు పుట్టలేదంటే అతనికి సిగ్గేసింది. ఉద్యోగంలో ప్రవేశించిన రెండేళ్లనుంచీ అతనికి అప్పు పుట్టకపోవడమనేది జరగలేదు. అంతకుముందు చదువుకునేటప్పుడు కూడ ఎప్పుడూ అప్పులే. ఇంటినుంచి

ఎమ్. ఒ. రావటం తడవుగా అతని రూమ్ మేట్సు అతన్ని హోటలుకు దారితీయించే వాళ్లు, ఏజన్మానా టిఫెన్ ముఖం ఎరగని వాళ్లలా. ఆ రాత్రి అందరూ సినీమాకు తప్పరుకదా! వాళ్ల డ్రింకులకూ, సిగరెట్లకూ తనే ఇచ్చేవాడు. ఏకొంతో హోటలుకు చెల్లించేవాడేమో. మళ్లీ నాలుగురోజుల్లో ఇంకో ఎమ్. ఒ కోసం ఎదురుచూడటంతో సరిపోయేది. వాళ్ళ గదిలో పంతులూ, రాజా కూడ అంతే పద్ధతి. ఇక ఎవడికి కావలసినంత వాడు అప్పులకు బయలుదేరడం. వాళ్ళు ముగ్గురూ విడుదలైన ఏ కొత్త సినీమా మానేరని? ఒకే సినీమా ఎవళ్లెక్కువసార్లు చూశారో అనే పోటీ కూడ. ఆ సినీమా బాగున్నదా లేదా అనికాదు, అది మరోసారి చూశామా లేదా అన్నదే లెక్క. మళ్లీ మనియార్డరు చాలాభాగం అప్పులు తీర్చడానికే సరిపోయేది. ఇక జరగబోయే నెల గడిచేదెలాగ? కనకం సెలవులకి ఇంటికి వెడితే అమ్మ అనేది: "నెలకి ఎనభై ఐదు పంపుతున్నా చాలలేదనే గోలే! వాళ్ళ సుబ్బారావుకి ఏభై ఐతేనే సరిపడుతున్నాయట. ఈవేళ ఇంత ఖర్చు జేస్తున్నామంటే కాదు. కొంచెం ముందు సంగతికూడ ఆలోచించుకోవాలి. ఈవేళ నాన్న సంపాదించి పెడుతున్నారంటే సరి కాదు. కాలూ, చెయ్యీ వంగితే తెచ్చేదెవరూ? ఆలోచించరేం?"

"మీ సంసారాలు ఎట్లా గడుస్తాయో నాకర్థంకాదు. ఇట్లా గుడ్డిగా ఖర్చుచేస్తే ఎట్లా చెప్పు?" అని నాన్న అనేవాడు. తనకి జ్ఞానం వచ్చినప్పటినుంచి నాన్న చేసే ఖర్చుకి అమ్మ సాధించిపోయడం కనకం వింటూనే ఉన్నాడు. నాన్న కేకలేసి అమ్మ నోరు మూయించేవాడు. చేసేదేంలేక బెంగపెట్టుకొని, ఏం జరగాల్సివుంటే అదే జరుగుతుందని అమ్మ సరిపెట్టుకొనేది. అప్పుడు కనకానికి యిదంతా ఏదో మామూలు విషయంగానే తోచింది. ప్రతి సంసారంలోనూ ఇట్లాంటి గొడవలు ఉంటూనే ఉంటాయని మాత్రమే అతను భావించాడు. ఆ డబ్బు బాధ తనకింతవరకు ఎప్పుడూ గట్టిగా తెలిసిరాలేదు. "అమ్మ చెప్పినట్లు తన స్థితి ముందుగతి లేకండానే సాగుతుందా?" ఆ ఆలోచన అతన్ని వణికించింది. ముచ్చెమటలూ పోశాయి. ఏదో జ్ఞానోదయం కలుగుతున్నట్లు అతనికి తోచింది. నడుస్తూనే సిగరెట్ తీసి వెలిగించాడు. ఒక్క దమ్ము లాగేసరికి ప్రస్తుతావసరంలోకి కళ్ళు తెరుచుకున్నట్లు అనిపించింది. అప్పటికప్పుడే రైలుస్టేషన్ దగ్గరకి వచ్చేసినట్లు గుర్తించుకోగలిగాడు. ఇంత దూరం ఎట్లా నడిచివచ్చానా అని అతనికి ఆశ్చర్యమేసింది. స్టేషన్‌లోకి పోయి కూర్చున్నాడు, వచ్చేపోయే రైళ్లను చూస్తూ. అందులో అతనికేదో గొప్ప ఆనందం కనిపించింది.



సిగ్గువిడిచి, ధైర్యంగా ఆవిడనే ఒక్క అయిదు బగులు అడుగుదామనుకున్నాడు......కాని అతనిలో ఏమూలో దాగివున్న మగతనం పరిహాసించింది.

ఇంక ఎప్పుడూ ఎవరిదగ్గరా అప్పు పుచ్చుకోకూడదనుకున్నాడు కనకం. అనుకున్నాడేకాని నిశ్చయించుకోలేదు. ఇంకా నెలల్లో సగంకూడ గడవలేదు. వచ్చినజీతం

(55 వ పేజీ చూడండి)

# అనుభవం



మా మిత్రత్రయంలో చిన్నవాడు రామం. అందులో పెద్దవాడి నయిన నాకు నాలుగేళ్ళ క్రిందటనే వివాహం జరిగింది. రెండవవాడైన రంగారావుకింకా అది జరగలేదు. అలాంటి సందర్భంలో చిన్నవాడయిన రామానికి సంబంధం నిశ్చయం కావడంతో ఆవిషయం మాచర్చకు గురిఅయింది. కాలేజీ జీవితమే మాముగ్గురికీ మైత్రి కుదిర్చింది. నేను యం. ఏ. క్లాసులో చదువుతున్నప్పుడు, ఆయేడే యింటర్‌లో చేరిన రామం, మామిత్రద్వయాన్ని "త్రయం"గా మార్చివేశాడు. నేను ఎమ్. ఏ. పూర్తిచేయటం, నాకు లెక్చరర్ పదవి దొరకడం, రామం యింకా చదువుతూ వుండడం, అందువల్ల నన్ను వాడు "మాస్టారూ" అని సన్మానిస్తూవుండడం, రంగారావుకి పట్టణంలోనే ఉద్యోగం దొరకడం, యివన్నీ మామైత్రికి విచ్ఛిన్నం తెచ్చిపెట్టకుండా కాపాడాయి.

"ఇంత చిన్నవయస్సులో యింకా చదువుపూర్తయినా కాకమునుపే నీవు పెళ్లికెట్లా యిష్టపడ్డావయ్యా రామం" అని ప్రశ్నించాను. నే ననుకున్నట్లు అతనీ ప్రశ్నకు సిగ్గుపడలేదు; పైగా నవ్వి ఉపన్యాసం మొదలుపెట్టడానికి తయారవుతున్నట్లు, కుర్చీలో కొద్దిగా జరిగి గంభీరంగా చెప్పడం మొదలెట్టాడు.

"చూడండి మేస్టారూ, మీకు కాలేజీ కుర్రాళ్ల విషయాలేవీ తెలియనివి కావు. హైస్కూలు జీవితం పూర్తయిన తరువాత కాలేజీల్లో చేరగానే విద్యార్థుల్లో యేదో గొప్పమార్పువస్తుంది. తమకే అంత గొప్ప చదువు చదవడం ప్రాప్తించిందనుకొంటారు. తమకంటే మించినవారు వుండరనుకుంటారు. అంతకుమునుపు స్కూలు పంతులు చెవులు మెలివేసినా తలవంచుకొని వూరుకునే వీరు, కాలేజిలెక్చరరు యేమాత్రం కఠినంగా మాట్లాడినా తమకేదో గొప్ప అవమానం జరిగినట్లు భావిస్తారు. అధ్యాపకులను తమకు క్షమాపణ పత్రాలు రాసియివ్వమని కోరిన విద్యార్థులు లేకపోలేదు. క్లాసులో కొద్దిగా చీవాట్లుపెట్టిన నేరానికి లెక్చరర్లపై తిరగబడి నానాహంగామాచేసి అందుకు నిరసనగా సమ్మెలుచేసిన సంఘటనలూ లేకపోలేదు. కావ్యజగత్తు మూడు పాళ్లు ప్రేమ శృంగారాలతోనే నిండుకుని ఉంది. వాటిలోని శృంగారాన్నంతా కృత్రిమంగా తమలో రూపించుకొని అథః పతితులైపోతున్న విద్యార్థులెందరు లేరు? ఏ కొందరో బుద్ధిమంతులుతప్ప పిచ్చిగా ఆడవాళ్ళను వెంబడిస్తూ, వెర్రివాళ్ళలా కేకలువేస్తూ అసభ్యంగా ప్రవర్తించేవాళ్లు చాలామంది వున్నారు. ఇలాంటివన్నీ చుట్టూ జరుగుతూ వుంటే శుకమహర్షిలా వుండడం సాధ్యం కాదు. ఏక్షణాన్నయినా మనస్సు చలించవచ్చు. అందువల్ల యికవచ్చే అనర్థాల విషయం వేరే చెప్పాలా గురూ! కాబట్టి నేనుకూడా ఓ కలభమై యీ కృత్రిమ ప్రేమాగ్నిలోపడి మాడి చావడంకంటే తొందరలో పెళ్ళి చేసుకొని హాయిగా సుఖంగా వుండడం మేలు కాదంటారా మేష్టార్యూ"

మా రామానికి యేవిధంగా నచ్చజెప్పాలో నాకు తోచలేదు. ఒకవిధంగా చూస్తే మావాడి వాదం సబబయినదే అనిపిస్తుంది. అయినా యింత తొందరలో వాడు సంసార సాగరంలో పడి యీదులాడాలనడం నాకేమంత నచ్చలేదు. పెళ్ళిళ్ళు కానివారికి వైవాహికజీవితం ఆనందమయమై, రసభరితమయినదై వుంటుంది. ఈ రొంపిలో దిగితేనే గాని వాళ్ళకు నిజం అంతుపట్టదు. అప్పుడు తలలు పట్టుకూచుంటారు. కాని పరిస్థితులు అప్పటికే మించిపోయి వుంటాయి. వివాహం కాని ప్రతివాడికీ యీ జీవితంలోని మాధుర్యాన్ని చవిచూడాలన్న ఆరాటం ఎక్కువగా వుంటుంది. రామానికింకా అప్పటికి యిరవై యేళ్లు నిండలేదు. ఇంకా అతనికి ఓటింగు హక్కు లేదు. అంటే అతనిలో యింకా రాజ్యాంగ విషయాపై మంచిచెడ్డలు నిర్ణయించుకునే బుద్ధి వికాసం పూర్తిగా వికసించలేదన్నమాటేగా! వాడికి పెళ్ళంటే యేదో తమాషాగా వుందనుకుంటాను.

"ఓరేయి రామం 'వివాహో విద్యానాశాయ, శోభనే సర్వనాశనమ్' అనేది వినేవుంటావు. మరి చదువుకు స్వస్తి చెప్పడమేనా ఇంక?" అన్నాడు రంగారావు.

ఈ ప్రశ్నకయినా వాడు వెనకాడలేదు. • మునుపటిలాగే నవ్వుకుంటూ మొదలెట్టాడు. "ఆ విషయం పంతులుగారి నడగండి. వారు కూడా విద్యార్థిదశలోనే పెళ్లి చేసుకున్నారుగా. వారి విద్య యెంతవరకు నాశనమైంది. బి. ఏ. యమ్. ఏ. రెండు పరీక్షలూ ప్రథమ శ్రేణిలోనే వుత్తీర్ణులయినారు. రంగారావుగారూ, మీరన్న సామెత ఏ కాలంనాటిదో, యెన్ని తరాలనుండి దిగుమతౌతూవచ్చిందో కొంచెం ఆలోచించండి. అవి ఆశ్రమాలలో విద్య అభ్యసించే రోజులు. బహుశా ఆ రోజుల్లో విద్యార్థులికి వాస్తవంగా సంసారంలో జొరపడేంతవరకు వైవాహికజీవితమంటే యేమిటో తెలియదనుకుంటాను. మరి యీనాడో!...బాగా అభివృద్ధి పొందిన పట్టణాల్లో చదువు, ఒకవైపు సినిమాలు, యింకొకవైపు యెక్కడబడితే అక్కడ కుప్పతిప్పలుగా దొరికే ప్రేమ పుస్తకాలు, మరోవైపు, బీచిషికార్లు, జంటలు జంటలుగా తిరిగే జనం, బస్సుల్లో, రైళ్ళలో యెక్కడ చూసినా పట్టుదల సడలించగల అంగనల అందం. అలాంటప్పుడు యువకులకు నిగ్రహం యెక్కడుంటుందండీ? అదీ కాక ఆ చదువులు వేరు, యీ చదువులు వేరు. పరీక్షలకు ముందు ఓ మూడు నెల్లు పట్టుబట్టి కూర్చుంటే రెండేళ్ల పాఠాలు పూర్తయి ప్రతివాడు పాసవుతాడు. అందులో యీనాడు ఆనాటిలాగా నూరేళ్లు గాక, జీవిత పరిమాణం యాభై యేళ్లయినా లేదు. మరి ప్రకృతి ఇచ్చే మాధుర్యాన్నంతా, ఈజీవితంలో తృప్తిగా అనుభవించడం ఎలాగ? ఇక 'సర్వనాశనం' విషయమంటారా అసలు అదేమిటో నాకర్థం కావడం లేదు. పెళ్ళి అయిన ప్రతివాడూ సర్వనాశన మౌతాడన్న మాట! భేష్. అయితే యెందరు నాశనమయ్యారు? పోనీ మన మాస్టారినే తార్కాణం తీసుకుందాము: వారి కేమయింది? పెళ్ళయింది.

ఓ బిడ్డ కూడా ఇప్పుడు సుఖంగా వుంటు న్నారు ఇదంతా యేమీ లేదు, అంతా బూటకం జీవితాన్ని సుఖవంతం చేసుకోవాలన్నా దుఃఖమయం చేసుకోవాలన్నా అంతా మన చేతుల్లోనే వుంది 'బుద్ధిః కర్మానుసారిణీ' అనగల రోజులు కావండీ యివి ఇది మెటీరియలిస్టిక్ ఏజ్ ఇప్పుడు బుద్ధి ననుసరించి కర్మ వుంటుంది అందుకే మానవుడే తన భవితవ్యాన్ని నిశ్చయించుకోగలవాడన్నారు"

రామం వాదన బాగానే వుంది ఇంక వాడి మనస్సు మార్చడం కష్టమే వాడేదో ఆదర్శంకోసం, తాను యీ కాలేజీ జీవితంలో ఏ మోహంలోనూ చిక్కుకోకుండా వుండాలని, యీ పెళ్లి చేసుకోడానికి యిష్ట పడుతున్నాడని తేలిపోయింది అయినా చివరిసారిగా చెప్పి చూద్దామని అన్నాను

"చూడబ్బాయీ! నీవన్నది నేను చాలా వరకు ఒప్పుకున్నా నీవు కూడా కాదనలేని కొన్ని విషయాలున్నాయి అందులో వొహటి పెళ్లి కావడంతోనే నీకు స్వేచ్ఛ అన్నది దూరమౌతుంది యవ్వన మన్నది, ఓ వరదవంటిది పెళ్ళనేది వరదకు ఓ కట్ట వంటిది ఆలోచించుకో అదీ గాక, మని షిలో నిగ్రహ మనేది గట్టిగా వుండాలే గాని, అది లేకుండా పెళ్లిళ్లు చేసుకున్నా లాభంలేదు పెళ్ళాలతో కాపురాలు చేస్తూ వ్యభిచారం సాగిస్తున్న మొగాళ్లెందరు లేరు? వాళ్లెందుకు చేస్తున్నారంటే నిగ్రహం లేకనే అని చెప్పాలి తరువాత నీయిష్టం"

రామం కొద్దిగా ఆలోచించాడు అయినా తన అభిప్రాయాన్ని మాత్రం మార్చుకొనే స్థితిలో లేడు "మీ రేమనుకున్నా సరే ఒక వుపమాన మిస్తాను తతిమ్మా విషయం మీరే వూహించుకోండి బాగా ఆకలి గొన్నవాడి నొకడిని ఒక గదిలోకి తీసుకెళ్లి అందులో పంచభక్ష్యపరమాన్నాలుంచి, 'ఒరేయి అబ్బాయి దొంగతనం అన్నది మహాపాపం సుమా! యిది పరాయి సొత్తు దీనిని తాకరాదు' అని నిషేధించి, వాడి నందులో బంధించి వుంచితే వాడది తినక మానుతాడా? చెప్పండి" అన్నాడు అలాంటి ప్రశ్నకు యిక మన మేమి జవాబియ్యగలం? పట్టినపట్టు వదలలేదు.

రామానికి వివాహమయింది తండ్రి బి ఏ పాసవుతేనే గాని శోభనం చేయనన్నాడట రామం తండ్రితో కూడా పోట్లాడేటట శోభనం బి. ఏ తరువాతనే అను కుంటే పెళ్లి కూడా అప్పుడే చేస్తే బాగుండేదిగా, అన్నాడు ఎంతయినా రామం కలిగిన వాళ్లకు యేకైకపుత్రుడు మరి వాడి పట్టు సాగుతుంది గాని, తలిదండ్రుల మాట సాగుతుందా!

అప్పటికి రామం పెళ్లయి యేణ్ణర్థం కావస్తోంది చదువులో బాగానే నెగ్గుతూ వచ్చాడు కాని యిక పైకిమాత్రం వెళ్లడానికి వీల్లేకపోయింది తండ్రి యేదయినా వుద్యోగం చూసుకొని కనీసం జేబు ఖర్చుల కయినా సంపాయించుకోమన్నాడు ఇక అప్పటినుండి రామం జీవితంలో కూడా చిక్కులు ప్రారంభమయ్యాయి సనాతన శిష్టాచారాలకు అలవాటుపడ్డ తలిదండ్రులు తన వైవాహిక జీవిత మాధుర్యానికి అడ్డు పడుతున్నారని అనుకున్నాడు సినిమాలకు, బీచి షికార్లకు పోవడం తల్లికేమంతగా గిట్టలేదు అలాంటి పిచ్చి పిచ్చి కుర్రచేష్టలు చేసి పిల్లదాన్ని పాడు చేయొద్దని తల్లి అడ్డుపెట్టసాగింది అత్తకు కోడలి మురిపెము యేడాదిలోనే తీరి పోయింది ప్రపంచంలో తాను కూడా ఓ అత్త గనక తన హక్కులన్నీ, కోడలి మీద రుద్ది తన ఉన్నతి నిలబెట్టుకోవాలను కుంది కోడలిని కాపాడడం, కొడుకుతో కోడలిపై చెప్పడం, కసురుకోడాలూ యెక్కువయ్యాయి తండ్రికూడా అప్పుడప్పుడు చీకాకుపడడం మొదలెట్టాడు ఇదంతా చూస్తే రామానికి విసుగెత్తింది అయినా వక్క సుగుణం అతని భార్య పాపం అమాయకురాలు, పదునాలుగేళ్లుంటాయి ఏమీ తెలియదనే చెప్పాలి అందులో ఆదర్శాలకు పోకులాడే రామం చదువుకున్న వాడు పల్లెటూరు పడుచుని చేసుకొని ఆమెకు నాగరికత, విద్య అంటగట్టాలని వాదించి "వూరిపిల్ల"ను చేసుకున్నాడు ఆమె మాత్రం అత్తకు కానీ భర్తకు గానీ యెదురాడలేకపోయింది అత్త యేదయినా అంటే మగనికి చెప్పి యేడ్చేది భార్యాభర్తలు స్నేహితులుగా వుంటున్నారు రామం తన అర్ధాంగిని బాగా అర్థం చేసుకున్నాడు

ఇక ఆయింటిలో వుంటే తన స్వేచ్ఛా జీవితానికి అన్నీ అడ్డంకులే అని భావించి, అప్పటికే నాలుగురాళ్ళు సంపాదించుకొంటున్న రామం వేరు కాపురం పెట్టాడు వానితో యిక సాధారణకుటుంబీకునికి వచ్చే సామాన్యమైన చిక్కులన్నీ వచ్చాయి ఉప్పు పప్పులకే చాలని జీతపురాళ్ళు అతనికి విలాసాలను భోగాలనూ యెక్కడ అనుభవించనిస్తాయి? దానితో అతని హృదయం గాయపడింది అయినా అన్యోన్యంగా మెలిగే భార్య మాత్రం గాయపడ్డ అతని హృదయాన్ని రెచ్చగొట్టక సుఖంగా కాపురం చేస్తూవుంది పరిస్థితులు కలిసి రాకపోయినా భార్యమాత్రం అనుకూలవతి అంతవరకయినా నయమే ననుకున్నాడు రామం

#  అనుభవజ్ఞుడు 

ఒక రోజు రామం రొప్పుకుంటూ రొజుకుంటూ మాయింటికి వచ్చాడు. వాడి ఆరాటం చూసేసరికి నాకే కళ్లనీళ్ళు తిరిగాయి. మనిషి కంగారుపడిపోయాడు. విషయాన్ని బయట పెట్టేందుకు పదినిమిషాలపాటు కిందుమీదయ్యాడు. అతని భార్య ప్రసవవేదన పడుతూవుంది. ఇంటిలో అడదిక్కు లేదు. తోడు యెవరూ లేరు. హాస్పిటలుకయినా తీసుకెడదామంటే టాక్సీ పిలవడానికయినా కాళ్ళాడటంలేదు. పాపం ఏమి చేస్తాడు. ఒక్కడే! సరాసరి నా దగ్గిరికి పరిగెత్తుకొచ్చాడు.

ఇక నేనూ నాభార్య పోక తప్పిందికాదు వాళ్ళయింటికి. నిజానికి ఆరోజు రామం పడ్డ ఆరాటం, కంగారూ చెప్పలేను. మనిషి తల్లడిల్లిపోయాడు. చిన్న వయస్సు పురిటింటిలోంచి గడిచి బయటపడడం పునర్జన్మేనని భావించేవాడు. అతనిభార్య గర్భంతాల్చిన మొదటిరోజుల్లో ఒకసారి నాసలహా తీసుకోడానికి నాదగ్గిరకొచ్చాడు. గర్భాన్ని నిరోధించడానికి నన్ను సలహా యిమ్మన్నాడు. నాకు ఒళ్లు మండుకొచ్చింది. "అయితే రామం మరి పెళ్ళియెందుకు చేసుకున్నావోయి" అన్నాను. ఏమని జవాబియ్యగలడు? అయినా ఓమాట అడ్డువేశాడు "అదికాదండి మేష్టారూ. దాని వయస్సు చాల తక్కువండీ. అదీ కాక యిప్పటి నా ఆర్థిక స్థితిలో పిల్లలు కూడానా! బర్త్‌కంట్రోల్ మంచిదని మన నాయకులుకూడా వొప్పుకుంటున్నారుగా, అందులో జనాభా..."

"చాల్లే వూరుకో...గాంధీజీ తన కొడుకు పెళ్ళివిషయంలో యేమన్నాడో తెలుసుగా 'పిల్లలు కావాలనుకుంటేనే పెళ్ళిచేసుకో కేవలం స్త్రీ సంపర్కం కోసమే అనుకుంటే చేసుకోబోకు' అన్నాడు. అని యెదురుతిరిగాను. కిక్కురుమనకుండా తిరిగి వెళ్లిపోయాడు. ఆనాటి నుండీ వాడికీవిషయంలో చాలా అదుటుగానే వుంది.

ఇప్పుడు వాడిస్థితి మరీ విషమించిపోయింది. కాలుగాలిన పిల్లిలా గదిచుట్టూ తిరుగుతున్నాడు. హాస్పిటలకు తీసుకుపోడానికి వీలులేకపోయింది. ఆ నాల్గుగంటల సేపు అల్లాడిపోయాడు. నేను వాడి ఆరాటాన్ని యేమాత్రం నిరోధించలేకపోయాను. "చిన్నపిల్ల గాబట్టి అంతగా బాధపడదు" అని నాభార్య చెప్పినా అతడు వూరట చెందలేకపోయాడు. ఒకటి చేయమంటే ఒకటి చేయడం మొదలెట్టాడు. చివరికి మంత్రసానిని పిలవడానికి నేనే వెళ్లాలసొచ్చింది. మాటి మాటికీ ఆగది దగ్గిరికి పోయి, లోపల ఆడవాళ్లేమయినా అనుకుంటారన్న బిడియం కూడా లేకుండా "ఎలావుందండీ" అని పదే పదే ప్రశ్నించడం మొదలెట్టాడు. అప్పుడు వాడి నడుగుదామనుకున్నాను "పెళ్ళిమజా యిప్పటికయినా తెలిసిందా" అని. కాని అప్పట్లో అది సబబుకాదని వూరుకున్నా.

పది పన్నెండు ఏళ్ల కుర్రవాడు యింటికివచ్చిన అతిథితో:- మీకు పెళ్లయిందా?

అతిథి:- కాలేదు.

కుర్రవాడు:- మరి పిల్లలెంతమంది?

అలా అడగడం తప్పని చెప్పి పెద్దలు వారించగా కొన్నాళ్ల తర్వాత వచ్చిన యింకో అతిథితో:-

కు: మీకు పిల్లలున్నారా?

అతిథి:- ఆ!

కుర్రవాడు:- మరీ...మరే పెళ్లయిందా?

శ్రీ పి. భోగి విజయవాడ.

ఓమూలకు పోయి తలపట్టుకొని కూర్చుంటాడు. ఉన్నట్టుండి లేచి గదిదగ్గిరికి పోయి నిలుచుంటాడు. మళ్ళీఅక్కడ వుండలేక బయటికి పోయి అటూ యిటూ పచార్లు చేయడం సాగిస్తాడు. మళ్ళీలోపలికొస్తాడు. ఇదీ వాడి చర్య. సిగరెట్లమీద సిగరెట్లు ఓరెండు టిన్నులు ఖాళీచేశాడు.

చివరికి నా భార్య తలుపు కొంచెం తెరిచి "ఆడపిల్ల" అని మళ్ళీ తలుపేసుకొన్నది. అప్పటికిగాని వాడిముఖంలో నవ్వు అనేది చూడలేకపోయాను. లోపలికి పోవాలని తొందరపడ్డాడు కాని లాభంలేకపోయింది. తలుపుదగ్గిరే గోడకానుకొని నిలుచుని ఏదో వింటున్నట్లు ఆలోచిస్తున్నాడు. మెల్లగా నాదగ్గరకొచ్చి "మేష్టారూ పిల్ల యేడుపు వినపడదేం?" అని ప్రశ్నించాడు. అప్పుడు నా కడుపు తరుక్కుపోయింది వాడి ముఖం చూచి. నిజానికి పుట్టి పావుగంటయినా పుట్టిన పిల్ల యేడుపు వినిపించలేదు. మళ్ళీ నా భార్య బయటికొచ్చింది. "తల్లీ పిల్ల క్షేమమేనాండి?" అని ప్రశ్నించాడు. "తల్లికేం ఫరవాలేదు లేవయ్యా" అని విసుక్కుందావిడ. నన్నావతలికి పిలిచి "పిల్ల చచ్చి పుట్టిందండీ" అన్నది. అనుకున్నంత అయింది. పాపం వాడెంత బాధపడతాడో! ఆవిడ లోపలికి పోబోతూవుంటే, "ఇప్పుడు చూడ్డానికి వీల్లేదాండి" అన్నాడు దీనంగా. "ఇప్పుడు

## మాకు కథలు, గేయాలు, చిత్రాలు, ఫొటోలు పంపేవారు

ఈ క్రింది అంశాలను గమనించ ప్రార్థన.

ప్రచురించని వానిని త్రిప్పిపంపగోరే వారు బుక్ పోస్టుకు అవసరమైన స్టాంపులను, రచనలూ, చిత్రాలూ ఫోటోలతోనే చేర్చిపంపాలి.

బుక్ పోస్టుకు అణా స్టాంపుకు తక్కువ కాకుండా పంపాలి.

రచనలను కాగితానికి ఒకే వైపున సిరాతో వ్రాసి పంపాలి.

ఫోటోలు కనీసం కార్డు సైజులో వుండాలి. నెగటివ్‌లు స్వీకరించబడవు.

చిత్రాలు ఇండియన్ ఇంకుతో వేసిపంపాలి. రంగుల చిత్రాలు స్వీకరించబడవు.

ప్రచురణ విషయాన్ని వెంటనే తెలియచెయ్యడం కష్టం.

నిరాకరించబడిన వానిని త్రిప్పి పంపడానికి మాకు కనీసం ఒక మాసమైనా వ్యవధి అవసరం.

ప్రచురించే వానిని గురించి ప్రచురించే ముందు మాత్రమే తెలియపరచగలము.

రచయితలూ, చిత్రకారులూ సహృదయంతో సహకరించగలరని విశ్వసిస్తున్నాము.

—సంపాదకుడు.

కాదు ఓ అరగంట ఆగాలి" అని మళ్ళీ తలుపు వేసేసింది.

"ఇంకేం ఫరవాలేదు లేరా. కొద్దిగా కాఫీ తాగుదాం" అని హోటలుకి తీసుకెళ్ళా. ఫలహారం సేవించి కాఫీ తాగుతూ వున్నప్పుడు మెల్లగా అన్నా: "ప్రతి ప్రసవంకేసులో మనం తల్లిప్రాణంకోసం యెక్కువగా ఆధారపడాలి. పిల్లలు పుట్టుతారు గిట్టుతారు. కాని తల్లిప్రాణం చల్లగా వుంటే పిల్లలు పదిమందిని కనవచ్చు. ఒప్పుకుంటావుగా. నీకు ఆడపిల్ల పుట్టింది. ఎక్కడో బాపిరాజు అన్నట్లు, ఎంతో పాపం చేసుకుంటేగాని ఆడపిల్లలు పుట్టరట. అందువల్ల ఈ విషయం కొంచెం విచారకరమయినదే. పుట్టిన బిడ్డ ప్రాణంపోయి పుట్టింది." నేను చెప్పుతూవున్నప్పుడు అతను యెత్తిన కప్పు యెత్తినట్టే వుండిపోయింది, పెదిమలదగ్గిర. చెప్పడం పూర్తికాగానే చేతిలోనుంచి జారి కప్పు ముక్కలు ముక్కలయింది. బట్టలన్నీ కాఫీ నీళ్ళతో తడిశాయి. వంగి పగిలిన ముక్కలు ఏరబోయాడు. "పగిలిన వాటిని అతికించలేవు" అన్నాను. మనిషిలో చైతన్యం నశించింది. మాట్లాడటం లేదు. నావేపు కళ్లప్పగించి వెర్రిగా చూస్తున్నాడు. హోటలు నుంచి యింటికి యేదో యంత్రంలాగా నడిచివచ్చాడు.

వాడి స్థితి అలాగేవుంటే కొద్దిసేపట్లోనే పిచ్చి యెత్తుతుందనుకున్నాను. లాగి చెంప మీద కొట్టాను. చెంప ఛెడేలు మనగానే వచ్చాను. కాని చురుకు తెలియడంతో చెంప తడుముకున్నాడు. "పో రామం, తల్లిని చూడు" అన్నాను. వాడికా పురిటిగదిలోకి పోడానికి యిప్పుడు మనస్కరించ లేదు. అయినా నా మాట తీసివేయలేక పోయాడు. అక్కడ యెక్కువసేపు వుండలేకపోయాడు. నీరసంతో, అలిసి కళ్ళు మూసుకొని పడివున్నది భార్య. చెమ్మగిల్లిన కళ్ళతో బయటికి వచ్చాడు. ఆతరువాత మూడు నెల్లకు చూచాను వాడి ముఖంలో నవ్వు.

"బిడ్డ వచ్చినా పురిటికంపు పోలేదు మాష్టారూ" అని మాటి మాటికి అంటూ వుండేవాడు. మొదట్లో యీ సామెత వున్నదని నాకు తెలీదు. తరువాత నా భార్య దాని భావం విడమర్చి కూడా చెప్పింది. ఇప్పు డెవరయినా "యేంరా రామం, చిన్నతనంలో పెళ్ళి చేసుకోమంటావా" అంటే చాలు-"ఒద్దురా బాబూ వొద్దు. అనుభవం వున్నవాడి మాటలు విను ఇప్పట్లో చేసుకోకు" అంటుండేవాడు. "అయితే నీ వెందుకు చేసుకున్నావోయ్" అని తిరిగి అడిగితే "అనుభవముంటేగాని తెలియదాయె. అనుభవం కావాలంటే చేసుకోవాలి. అయినా అనుభవమయినతరువాత వద్దనుకుంటే పోదాయే. కాబట్టి అనుభవమున్నవాడి మాటలు కాస్తయినా పాటించండి" అంటాడు. ★

శరభయ్య:-(ప్రక్కవాటావానితో) ఏమండోయ్ ఓ బయ్యగారూ ఒక్కసారి తలుపు తీస్తారా!

ఓబయ్య తలుపు తీసి; "ఏమండీ! ఇట్లా దయ చేశారు."

శరభయ్య:- ఆ! ఏమీ లేదు. మీవాళ్ల జాకెట్ మా యింట్లో పడ్డాది. ఇచ్చి పోదామని వచ్చా.

ఓ:- థేంక్సు. ఇలాగే ఉంటాయ్ ఆడాళ్ల తెలివి తేటలు. (అని తీసుకొని భార్యకిస్తాడు)

శ:- ఆ; దానికేం లెండి. నేను పరాయి పూచికపుల్ల ఇంట్లో పడితే సహించను.

రెండు రోజులు పోయాక—

శరభయ్య:- ఓబయ్యగారూ తలుపుతీస్తారా కాస్త.

ఓబయ్య తలుపు తీస్తూ; ఏం మళ్లీ దయచేశారు?

శ:- ఆ ఏంలేదూ! ఇండండి ఇవీ మీవే (అని ఎంగిలాకుల కట్ట బల్లపై నుంచాడు) కాస్త పరాకుమానమని ఘట్టిగా చెప్పండి ఇంట్లో; ఇల్లా వస్తువులు పై వాళ్లిళ్లలోకి పోకుండా.

శ్రీ డి. శేషగిరిరావు, గొల్లపూడి

వారానికి ఒక్కసారైనా యింటికి వచ్చి పిల్లల యోగక్షేమాలు చూసే సత్యనారాయణ నెలరోజులు గడిచినా యింటికి రాలేదు. జానకమ్మకు ఆదుర్దా కలగలేదు కాని చాలా బాధపడింది. చిన్న విషయంపై మాటపట్టింపులు పెట్టుకుని కోపంతో భర్త యింటికిరావడం మానేశాడని ఆమెకు తెలుసు.

ఎంతో అభిమానంతో నిత్యమూ పరిపోషాలాడే సత్యనారాయణ, కోపం తెచ్చుకొని యింటికి రాకపోవడంవల్ల యిల్లంతా చిన్నబోయింది. పిల్లలు తండ్రిగురించి అస్తమానూ అడగసాగారు. ఐదేండ్ల ఆఖరిపిల్ల విమలకు మూడురోజులనుంచి తీవ్రంగా జ్వరం కాస్తోంది. తండ్రిగురించి కలవరిస్తోంది.

అక్కడికి నాల్గు ఉత్తరాలుకూడా రాసింది జానకమ్మ, యింటికి రావలసింది పిల్లలు బెంగపెట్టుకున్నారని. కాని సత్యనారాయణకు జానకమ్మమీద కోపంతగ్గక యింటికిరాలేదు. ఆమె కాపురానికివచ్చాక గడిచిన పదిసంవత్సరాలలోనూ సత్యనారాయణకు యింతకోపంరావడం జానకమ్మ ఎప్పుడూ చూడలేదు. ఆ కోపం యిక ముందుకూడా యిలాగే ఉండిపోతుందేమో అని భయపడి దుఃఖం ఆగక ఏడ్చింది.

అప్పుడే ఆటలు ఆడుకుని యింటికివచ్చిన కృష్ణుడు, తల్లిఏడుస్తూ కొంగుతో కన్నీరు తుడుచుకోడం చూశాడు. ఆమె కన్నీరు అతనిలో ప్రేమనుప్పొంగజేసింది.,

"అమ్మా! ఎందుకే ఏడుస్తున్నావు!" అంటూ కృష్ణుడు తల్లిఒడిలోకూర్చుని అనునయించాడు.

తొమ్మిదేండ్ల కుర్రవాడు కృష్ణుడు తన దగ్గరకువచ్చి అనునయిస్తూంటే, ఎందుకో ఆమెకు దుఃఖం పొంగిపొరలింది. వెక్కివెక్కి ఏడ్చింది. దుఃఖం దిగమింగుకుని మొండిగా సంచరించేవాళ్ళని ఎవరైనా ఓదారిస్తే సముద్రపు కెరటంలా ఒక్కసారి ఉబికి వస్తుంది. దుఃఖం.

జ్వరంతో మంచం మీద పడుకున్న విమల "అమ్మా! నాన్న ఎప్పుడు వస్తారే! మంచిబొమ్మలు తెస్తానన్నారే నాకు" అంటూ తల్లినడిగింది.

కృష్ణుడికి తండ్రి జ్ఞాపకం వచ్చాడు.

"అమ్మా! నాన్న నెల్లాళ్ళనుంచి ఎందుకు రావటం లేదే యింటికి" అని అమాయకంగా ప్రశ్నించాడు.

ఏదో కారణం కొడుక్కు చెప్పవలసిన బాధ్యత జానకమ్మ మీదపడింది. అసలు సంగతి చెప్పదలచకపోయినా, దానికి సంబంధించిన మాటలు మాత్రం అప్రయత్నంగా ఆమె నోట వచ్చేశాయి సమాధానంగా.

"మీ నాన్నకు నామీద కోపం వచ్చిందిరా."

"ఎందుకే?"

ఈ మాటకు ఏం సమాధానం యివ్వాలో జానకమ్మకు తెలియలేదు. ఆపుకుందామన్నా దుఃఖం ఆగక బలవంతాన పైకి పెల్లుబికింది. తల్లి ఏడుపుచూసి కృష్ణుని కడుపు తరుక్కుపోయింది.

శ్రీ పోతుకూచి
సాంబశివరావు

"ఎందుకే అమ్మ అలా ఏడుస్తావు? నేను వెళ్ళి నాన్నగారిని తీసుకువస్తానే".

కొడుకు మాటలు విని ఒక్కసారి జానకమ్మ అతని ముఖంలోకి చూసింది. ఆమెకు మెదడులో ఏదో గబుక్కున ఆలోచన తట్టింది. కాని ఆమెకు భయం వేసింది. కొడుకు ఒక్కడూ ప్రయాణం చేసి తండ్రి దగ్గరకు వెళ్ళగలడా?

అయినా కొద్ది రోజులు ఓపిక పడితే సత్యనారాయణ తిరిగి రావచ్చునే ఆశతో, ఆ విషయం ప్రక్కకు నెట్టింది ఆమె.

మరో పదిహేనురోజులు గడిచినా సత్యనారాయణ యింటికిరాలేదు. అతను యిల్లు విడిచి వెళ్లినప్పుడు యిచ్చిన అరవై రూపాయిలు ఖర్చుయిపోయి అప్పుడే రెండువారాలు గడిచాయి. పైగా అప్పులు పెరిగిపోయాయి ఆ వూరిలో.

సత్యనారాయణ పుట్టి పెరిగిన ఊరు అవడంవల్ల, ఆయనకున్న పరపతి యింతకాలం జానకమ్మ ఉపయోగించుకుని కృష్ణుడిచేత యింట్లోకి కావలసిన దినవెచ్చాలు అప్పు చేసి తెచ్చుకుంటోంది. పాలు, చాకలి, పెరుగువాళ్లుమామూలుగా వతనుగాపోస్తున్నా, నెలాఖరున డబ్బు ముట్టకపోవడంవల్ల రోజూ యింటికివచ్చి అడిగి, కసురుకుని మరీ వెళ్ళిపోతున్నారు. బియ్యం యిచ్చే వీరన్న నాల్గోసారిరావడమైంది. "ఏమండీ! డబ్బు యివ్వరా? బాబుగారు ఎప్పుడు వస్తారు!" అని సణిగాడు దినదినగండంగా బ్రతికే యింట్లో దాసీది నెలాఖరున రావలసిన నాల్గురూపాయిలు ముట్టకపోయేటప్పటికి కటకటలాడిపోతూంది. జానకమ్మను బెదిరించిందికూడా,పని మానేస్తానని. కోమటిసత్తెయ్య పద్దుబుక్కు పుచ్చుకుని పదిసార్లు ప్రత్యక్షమైయాడు.

పొరుగింటి రహస్యాలు భేదించి తెలుసుకుంటేగాని ఉబుసుపోని అమ్మలక్కలు, సత్యనారాయణ నెలాపదిహేను రోజులు యింటికి రాకపోవడంవల్ల సంగతి ఏమిటని గుసగుసలాడుకున్నారు. కారణం ఏమీ కనిపించక, జానకమ్మను వదిలేసి ఉంటాడనీ, ఏ ముండలతో లేచిపోయాడనీ నోటికివచ్చినరీతిగా అపవాదులు ప్రచారం చేశారు.

ఇవన్నీ జానకమ్మ చెవినిబడ్డాయి. ఆ మాటలు విని సహించలేక కుళ్ళి కుమిలి ఏడ్చింది. యింక ఎలాగైనా కృష్ణుడిని తండ్రిదగ్గరకు పంపి యింటికి రమ్మందామనుకుంది. దారి ఖర్చులకు ఏమిస్తుంది? చేతిలో ఒక్క పావలామాత్రం ఉంది. ప్రక్కయింటివారిని అప్పు అడుగుదామంటే, తన భర్త విషయము మొట్టమొదట ప్రశ్నిస్తారు. ఆమెకు తల తీసినట్లవుతుంది. జానకమ్మకు ఏమీతోచక దిగులుగా ఒక మూల కూర్చుని ఏడుస్తోంది.

కృష్ణుడు తల్లి దిగాలు ముఖం, దుఃఖం చూసి ఆమె దగ్గరకు వచ్చాడు.

"ఎందుకే అలా వున్నావు అమ్మా! నేను వెళ్ళి నాన్నగారిని తీసుకువస్తాను. డబ్బు యివ్వవే" అన్నాడు.

ఉబికివచ్చే దుఃఖాన్ని దిగమింగుకుంది జానకమ్మ.

"అయితే వెడతావా కృష్ణా?"

"వెడతానమ్మా."

"ఎలాగ వెళ్ళాలో తెలుసా!"

"బజారులో బస్సుందికదే! అది ఎక్కితే వెళ్ళిపోతాను."

ఇప్పటివరకు ఎన్నడూ కృష్ణుడు ఒంటరిగా ప్రయాణంచేసి ఎరగడు, అందులో ముప్పదిమైళ్లు దూరంలో ఉన్న కోటిఫలి ఎలా వెళ్ళాలో ఏం తెలుస్తుందో! బజారులో బస్సుస్టాండు దగ్గర "కోటిఫలి" అని వ్రాసివున్న బస్సు చూసి, అది ఎక్కితే కోటిఫలి వెళ్ళిపోవచ్చుని అతని ఉద్దేశ్యం. పైగా తండ్రి కోటిఫలి వెడుతూ ఆ బస్సు ఎక్కడం రెండుసార్లు చూశాడు కృష్ణుడు.

కొడుకు ఊహ గ్రహించి జానకమ్మ నవ్వింది. అతని ఊహాలలోతు కనుక్కుందామని మళ్ళీ ప్రశ్నించింది జానకమ్మ.

"మరి కోటిఫలి బస్సుఎక్కి వెడతావనుకో! తర్వాత నాన్నగారు ఎక్కడ ఉన్నారో ఎలా కనుక్కుంటావురా."

"ఏముందీ! యినస్పెక్టరు సత్యనారాయణగారు ఎక్కడున్నారని అడిగితే, ఎవరైనా చెబుతారమ్మా! నోట్లో నాలిక ఉంటే అన్నీ చేయవచ్చు."

కృష్ణుడి మాటల అమాయకత్వంలోని ధైర్యం జానకమ్మకు సేద తీర్చింది. కాని చేతిలో ఒక్క పావలా మాత్రం ఉంది. బస్సుకైతే రూపాయిన్నర కావాలి. పడవకైతే మూడణాలతో వెళ్ళవచ్చు. ప్రక్కయింటి అమ్మలక్కలను అప్పు అడగడం యిష్టం లేక, కొడుకుచేతిలో పావలా పెట్టింది జానకమ్మ.

"సాయంత్రం ఆరుగంటలకు కాలవ ఒడ్డుకు కోటిఫలివెళ్ళే పడవ వస్తుంది. అది ఎక్కితే తెల్లవారేసరికి కోటిఫలి వెళ్ళవచ్చు. నాన్నగారిని కలుసుకుని యింటికి నేను రమ్మన్నానని చెప్పు." అంది జానకమ్మ, కృష్ణుడిని ఒంటరిగా ప్రయాణం చేయిస్తున్నాననే దిగులుతో. అది తప్ప మరోమార్గం కనిపించలేదు ఆమెకు.

"నీ కంత బెంగ ఎందుకే, నేను వెళ్ళివస్తాగా" కృష్ణుడిచ్చే అమాయక వాగ్దానం నవ్వుతూ అందుకుంది.

కంచంలో పెట్టిన అన్నం తిన్నాడు కృష్ణుడు. యింటిలో ఉన్న పాతసంచీలో రెండు లాగులు రెండుచొక్కాలు వేసి కృష్ణుడి చేతికిచ్చింది జానకమ్మ.

సంచీ అందుకుని 'వెళ్ళివస్తానే అమ్మా' అన్నాడు కృష్ణుడు.

"ఎక్కడికి అన్నయ్యా" అంది విమల వీధిలోంచి వస్తూ. పిల్ల "ఎక్కడికి" అని వేసినప్రశ్న కృష్ణుడి ప్రయాణానికి అపశకునమేమో అని భయపడింది జానకమ్మ. కాని అమాయకపు చిన్ని ఆడపిల్ల నవ్వుతూ ఎదురుగా రావడం మంచిశకునం కావచ్చుని తర్వాత ధైర్యం తెచ్చుకుంది ఆవిడ.



"మీ నాన్నగారిప్పుడు ఎక్కడుంటున్నారు?" "కోటిఫలిలో" అన్నాడు ధీమాగా కృష్ణుడు ఆ ముసలాయనమాటల్లోని అంతరార్థం తెలియకపోయినా.

"నాన్న దగ్గరికి" అన్నాడు కృష్ణుడు చెల్లెలితో.

"అమ్మా! నేనూ వెడతానే" అంటూ మారాము చేసింది విమల.

"తప్పు! అన్నయ్యవెళ్లి నాన్నను తీసుకవస్తాడు. అందాక మనం యిద్దరం ఇక్కడే వుందాం. మంచికథలు చెబుతాను." అంది జానకమ్మ.

"నువ్వు ఎప్పుడూ యింతే. ఎక్కడికీ పంపవు." అంటూ మూతిముడుచుకుని యింట్లోకి పోయింది విమల.

కృష్ణుడు నవ్వుతూనుంచున్నాడు, తల్లి అనుజ్ఞకోసం.—

# రాయబారి

"మరి నాన్నగారు కనిపించకపోతే, మళ్ళీ యింటికి ఎలా రాగలవురా" అంటూ దిగులుగా మళ్ళీ అడిగింది జానకమ్మ. తాను యిచ్చిన పావలా ఒక్క పడవఖర్చుకు సరిపోతుంది.

"నువ్వేం భయపడకమ్మా! నేను పల్లెవెళ్ళగానే లాగ నాన్నగారిని తీసుకువస్తాగా." అంటూ నవ్వుతూ గబగబ వీధిలోకి అడుగులు వేశాడు కృష్ణుడు. కంటికి కనిపించేదాక జానకమ్మ కొడుకుకేసి చూస్తూ గుమ్మంలో నిలబడిపోయింది.

* * *

తల్లియిచ్చిన బట్టలసంచీ బుజాన తగిలించుకుని, కాలవరోడ్డు పట్టాడు కృష్ణుడు. అప్పుడప్పుడు కాలవకు నాన్నతో అమ్మతో స్నానాలకు వెళ్ళేవాడు. అందుచేత ఆరోడ్డు పూర్తిగా జ్ఞాపకం.

మైలుదూరం నడిచి, కాలవస్నానాల రేవు దగ్గర చేరాడు కృష్ణుడు. అప్పుడే సూర్యుడు అస్తమిస్తున్నాడు. ఫర్లాంగు దూరంలో ప్రయాణీకులను కాలవ రెండు గట్టుకు చేరుస్తున్నా డొకడు దోనెలో. కాలవ రెండువైపులా ఉన్న ఈతచెట్లు రివ్వున వీచేగాలికి తలలాడిస్తున్నాయి.

ఎవరో ఒక అపరిచితుడు, ముసలాయన చుట్ట కాల్చుకుంటూ, ఆదారిని పోతూంటే కృష్ణుడు పలకరించాడు.

"ఏమండీ! కోటిఫలికి వెళ్లే పడవలు యిక్కడికే వస్తాయాండి?"

"ఆఁ"

"ఎన్ని గంటలకు వస్తాయో మీకు తెలుసా."

"ఒక అరగంటలో రావచ్చు"

అంటూ నోట్లోంచి ఆయన చుట్ట తీసి, తుపుక్కున ఉమ్మేసి, తిరిగి నోట్లో చుట్ట పెట్టుకుంటూ పరకాయించి చూశాడు కృష్ణుణ్ణి.

"ఎవరబ్బాయివి బాబూ"

"సత్యనారాయణగారి అబ్బాయిని."

"అలాగా!...అయితే మీ నాన్నగారిప్పుడు ఎక్కడుంటున్నారు."

"కోటిఫలింలో ఉంటున్నారు" అన్నాడు ధీమాగా కృష్ణుడు. ఆ ముసలాయన మాటల్లోని అంతరార్థం తెలియకపోయినా.

"హిహిహి: అలాగా" అనుకుంటూ ఆ ముసలాయన వెళ్ళిపోయాడు.

కృష్ణుడు అదే పడవల రేవని నిశ్చయించుకున్నాడు. మరోక్షణం ప్రక్కకి చూడగానే ఆమడదూరంలో ఒక పడవ కనిపించింది. ముగ్గురు మనుష్యులు త్రాడుపడవకు కట్టి గట్టుమీద నడుస్తూ లాగడం చూశాడు. నిండుకాలవ నీటిలో తెరచాప విప్పుకొని అందంగా మందయానం చేస్తున్న ఆ పడవ ఒయ్యారాలొలికిస్తూ రెక్కలు విప్పుకు నడిచే హంసలా ఉంది.

పడవ రేవుచేరింది. గట్టుమీదనుంచి పడవ లాగేవాళ్ళు తాడు చుట్టి దానిలోపల విసిరేరు.

లావుగా బొద్దుగా, నల్లగా గిరజాలు వేలాడేసుకొని చెవులకు వెండికమ్మలు తగిలించుకుని పడవ తెడ్డుతో బయటనుంచున్న మనిషి కృష్ణుడిని పలకరించాడు.

"ఏవూ రెడతావయ్యా!"

"కోటిఫలి!"

"ఎక్కు ఎక్కు" అంటూ పళుక్కుమని కర్ర విరిచినట్లు అని ఊరుకున్నాడు ఆ పడవ ఆసామీ.

"టిక్కెట్టెంత?"

"మూడు అణాలు."

"ఎంతసేపట్లో బయలుదేరుతుంది."

"అదేపోతుంది ఎక్కవయ్యా" అంటూ కసిరాడు ఆ పడవ పెద్ద.

కృష్ణుడు పడవ ఎక్కాడు. నిమ్మకాయలు నిలబడకలిగే ఆ పడవ ఆసామీ పెద్ద మీసాలు, చింతనిప్పల్లాంటి ఎర్రటి కళ్ళు చూసి, వీళ్లు దొంగలేమో అని లోపలభయపడ్డాడు కృష్ణుడు. పడవ లోపలికి వెళ్ళగానే ఒకముప్పయి ఏండ్ల వితంతువు, ఒక పదేళ్ళ కుర్రాడు, శాలువా కప్పుకుని శ్రోత్రియంగా కనపడుతున్న ఒక మధ్య వయస్సు శాస్త్రుల్లుగారు కనిపించారు.

"పిన్నిగారూ యీ పడవ కోటిఫలి వెడుతుంది కదాండి" అని వరుసకలిపి, చనువు చేసుకుంటూ ఆ వితంతువును పలకరించాడు కృష్ణుడు.

"వెడుతుంది బాబూ"

కృష్ణుడి మనస్సు స్థిమితపడింది.

"ఆ అబ్బాయి మీ కొడుకాండి"

"కరిచేస్తా. నీకెందుకు నా గొడవ" అరుస్తూ ఆ కుర్రాడు కొండ్రించి, కృష్ణుడివైపు చురచురా చూశాడు.

ఈ లోపుగా వితంతువు అడ్డుపడింది. "వాడికి మతిలేదు నాయనా, ఏమీ పలకరించకు." అది వినగానే ఆ కుర్రాడు చర్రునలేచి "నాకు మతిలేదూ" అంటూ ఆ వితంతువును కొట్టబోయాడు. ఎదురుగా ఉన్న శాస్త్రిగారు ఆ కుర్రాడిని పట్టుకుని బెదిరించి మూల కూర్చోబెట్టారు. ఒక నిట్టూర్పు విడిచి 'కర్మ' అంటూ చేతిలో రుద్రాక్షమాల త్రిప్పడం మొదలుపెట్టారు ఏదో జపిస్తూ.

కృష్ణుడు యింక వాళ్లతో మాట్లాడలేదు. పడవ కదిలింది. పడవ నడుస్తున్నంతసేపు అతనికి భయమే; మధ్యలో యీ పిచ్చి కుర్రాడు లేచి పీక నొక్కుతాడేమోనని. నల్లగా దొంగల్లా కనిపించే పడవవాళ్ళు తన సంచీ దొంగిలిస్తారేమో అని ఒళ్ళో దాన్ని గట్టిగా పట్టుకుని ముడుచుకు కూర్చున్నాడు.

పడవనడుస్తోంది. చుట్టూ నిశీథం. పడవ ముందుకట్టిన హరికేన్ లాంతరు వెల్తురు మాత్రం కాలవనీటిలో పడి, బంగారు రంగుతో పడవ రహదారినీటిమీద మలిచినట్లయింది.

తన జీవితంలో మొట్టమొదటి ప్రయాణం అది కృష్ణుడికి. పడవకున్న అద్దాల కిటికీ ద్వారా బయటికి చూశాడు. ఆ నిశీథంలో చెట్లు గుబురు గుబురుగా కనిపించాయి. ఆకాశంలో చుక్కలు మిల మిలా మెరుస్తున్నాయి చూస్తున్నకొలదీ, తనుచూడవలసిన విశాలప్రపంచం యింకా ఎంతో వుందనిపించింది.

ఒకలాకు వద్ద పడవ ఆగింది. లాకు తలుపులు తెరుచుకున్నాయి. లాకులో పాతాళంలో ఉన్నట్లుంది. పడవ పడవ ఆసామీలు చుట్టపొగ గుప్పుగుప్పున వదులుతున్నారు. పాతాళంలో ఉన్న పడవ క్రమక్రమంగా పైకి తేలడం మొదలెట్టింది. అది ఎంతో చిత్రంగా ఉంది కృష్ణుడికి. లాకులులోంచి బయటికి వచ్చాక ఆపడవని ఆరాత్రికి అక్కడ కట్టేశాడు; దారిలో ముందు దోపిడి దొంగల గొడవ ఎక్కువగా ఉందని.

రాత్రి లాకులవద్ద ఆగిపోవడంవల్ల, తెల్లవారగానే కోటిఫలి చేరవలసిన పడవ, మధ్యాహ్నం పదకొండుగంటలకు చేరింది.

కృష్ణుడు పడవదిగి ఊళ్ళోకి నడిచాడు.

మేనేజరు:- పర్మిషన్ లేందే లోపలకి రాకూడదని తెలియదూ?

అతడు:- తెలుసునండి

మేనేజరు: - మరయితే ఎందుకు వచ్చినట్టు?

అతడు: - తమ పర్మిషన్ కోసమే నండి.

శ్రీ కె. సుబ్రహ్మణ్యం, (భీమవరం)

ఎండ మిటమిటలాడుతూంది. దారిలో రైతు ఒకడు కర్రపుచ్చుకుని పోతూంటే "యినస్పెక్టరు సత్యనారాయణ గారెక్కడుంటారో తెలుసా" అని అడిగాడు. "ఏ యినస్పెక్టరయ్యా" అంటూ సాగిపోయాడు రైతు.

కృష్ణుడికి ఒక ఆలోచన తట్టింది. తండ్రి ఆఫీసు కనుక్కుంటే యింటికి ఎవరో ఒకరు అక్కడినుంచి దారి చూపిస్తారని, ఆశ కలిగింది. రెండడుగులు వేయగానే పోస్టు బంట్రోతు ఎదురయ్యాడు. అతన్ని అడిగాడు యినస్పెక్టరు గారి ఆఫీసు ఎక్కడని.

"ఏ యినస్పెక్టరు, పోలీసాకె రెవిన్యూకె కోపరేటివ్? ఎవరు?"

 రాయబారి 

"సత్యనారాయణగారు"

పోస్టుబంట్రోతుకు అర్థమైంది ఆఫీసుకు దారి చూపించాడు

ఆఫీసు గుమ్మంలో చేరగానే, ఎదురు గదిలో, ముగ్గురు గుమాస్తాలు, కాగితాలు బరబరా, చెమట్లు కార్చుకుంటూ గీసేస్తున్నారు. వాళ్లని అడిగాడు కృష్ణుడు "సత్యనారాయణగారున్నారా" అని.

'ఎందుకు' అన్నాడొక ముసలిగుమాస్తా. కళ్ళజోడు జాగ్రత్తగా పైకి ఎత్తిచూస్తూ.

'మానాన్నగారు ఆయన' అన్నాడు కృష్ణుడు. ఆ ముసలిగుమాస్తా ఒక్క గెంతువేసి లేచాడు.

"రండి రండి అబ్బాయిగారూ లోపలికి రండి." అంటూ ఆఫీసు గదిలోంచి వరండాలోకి తీసుకు వెళ్ళాడు. అడుగులకు మడుగులొత్తుతూ ముందు నడిచే ఆ ముసలి గుమాస్తా వైపంచూస్తే, తనకు రాచమర్యాదలు జరుపుతున్నట్లనిపించింది. కృష్ణుడు పొంగిపోయాడు, తన తండ్రి చాలా గొప్ప ఉద్యోగి అని. వెనక ఉన్న గుమాస్తాలు 'ఇనస్పెక్టరుగారి అబ్బాయిట్రా' అంటూ నోరు ఆవలించారు.

ఆఫీసుగది దాటి లోపల వరండాలో కాలుపెడుతూ "మీ అబ్బాయి గారొచ్చారండి" అన్నాడు ఆ ముసలిగుమాస్తా.

"రమ్మను లోపలికి" అన్నాడు సత్యనారాయణ విసుగ్గా, గుమాస్తా అన్నమాటలు పూర్తిగా వినిపించుకోకుండానే.

వరండాలో అడుగుపెట్టగానే పదిమంది జనం గుండ్రంగా కూర్చుని, ఎదురుగా రూపాయలు ఖంగుమనిపిస్తూ, ఎర్రటి చింత నిప్పుల్లాంటి కళ్ళతో తీవ్రంగా ఒకరినొకరు చూసుకుంటూ పేకముక్కలు సర్దుకుంటున్నారు. అసలు కృష్ణుడిని చూసే తీరిక లేనట్టున్నారు ఆజనం.

"నాన్నా" నాన్నా "అన్నాడు కృష్ణుడు భయంతో.

సత్యనారాయణ తల పైకెత్తిచూశాడు. మోకాలు దాకా చిన్న నల్లనిక్కరు తొడుక్కుని, మాసిపోయిన తెల్ల చొక్కాతో, బుజానికి సంచీ తగిలించుకుని, చెల్లా చెదిరి ఎగిరే ముంగురులతో, చెప్పులులేని పాదాలతో, ఎండదెబ్బకు నీరసిల్లిన గొంతుకతో ఎదురుగా నిలుచున్న కృష్ణుణ్ణి చూసి ఆశ్చర్యపోయాడు సత్యనారాయణ. ముప్పైమైళ్ళ దూరంనుంచి ఎలా వచ్చాడో, ఎందుకు వచ్చాడో, అర్థం కాలేదు ఆయనకు

"ఏరా! యిదేనా రావడం! యింటి దగ్గర అంతా కులాసాగా ఉన్నారా" అన్నాడు సత్యనారాయణ కంగారుగా.

"అంతా బాగున్నారు నాన్నా" అంటూ సంచీ బుజాన్నించి తీసి, గబగబా వెళ్ళి తండ్రి ప్రక్కన కూర్చున్నాడు కృష్ణుడు. నెలా పదిహేనురోజుల తర్వాత కొడుకును చూసిన సత్యనారాయణకు పుత్రవాత్సల్యం ఉప్పొంగింది. ఐదు నిమిషాలలో పేకాట ముగించి లేచారు. ప్రక్కనున్న స్నేహిత బృందం "యితను మీ అబ్బాయి ఏమిటోయి? "ఏం చదువుతున్నావు? అబ్బో! ఇంతదూరం ఒంటరిగా ప్రయాణం చేసి వచ్చావన్నమాట" అంటూ ప్రశ్నలవర్షం కురిపించారు. "మరి మావాడంటే ఏమనుకున్నారు" అంటూ సత్యనారాయణ కొడుకు చదువు, తెలివితేటలు గురించి గర్వంగా సమాధానం యిచ్చేడు. కృష్ణుడు ఠీవిగా నవ్వేడు, తను గొప్పవాడన్నట్లు అందరూ పొగడుతూంటే.

ఇంటికి తీసుకువెళ్లేడు తండ్రి. చేతివేళ్లు పట్టుకుని నడుస్తూ "నాన్నా యిది మీ ఆఫీసా" అని అడిగాడు కృష్ణుడు.

"అవును."

"మరి! ఆఫీసులో పేకాడుతారా?"

"ఏడిశావు! ఆ గొడవ నీకెందుకు?"

"అదికాదు నాన్నా అందరూ మరి కాగితాలు వ్రాస్తారు కదూ!"

"అవును మనకు ముగ్గురు గుమాస్తాలున్నారుకదూ, అంతపనీ వాళ్ళే చేసేస్తారు."

కృష్ణుడు ఇంక మాట్లాడలేదు ఆ విషయం గురించి. యింటికి వెళ్లాక స్నానం చేసి దుస్తులు మార్చుకున్నాడు. కృష్ణుడు ఎందుకు వచ్చాడో తెలుసుకునే ఆలోచనలో నిమగ్నుడైన సత్యనారాయణ తేరుకున్నాడు. కృష్ణుడు దుస్తులుమార్చుకురాగానే ఇద్దరూ హోటలువైపు నడిచారు.

తాటాకులతో కట్టిన ఆహోటలు ముందు భాగం అందంగా మేజా బల్లలతో నిండి ఉంది. లోపల గదిలో మేజా బల్లమీద భోజనాలు వడ్డించారు. వడ్డించే మనిషి "మీ అబ్బాయిగారాండి" అంటూ కృష్ణుడి వైపు చూశాడు. అవునన్నట్లు నవ్వాడు సత్యనారాయణ. "అలాగాండి" అంటూ అతను యింకా రెండుసార్లు అన్ని వంటకాలు ఎక్కువచేస్తూ అతి మర్యాదగా భోజనం పెట్టాడు.

"అమ్మ నిన్ను ఎందుకు పంపిందిరా" అన్నాడు సత్యనారాయణ భోజనాలయి పోక, యింటికి వస్తూంటే.

"నీకోసం బెంగపెట్టుకుంది నాన్నా. అస్తమానూ ఒక మూల కూర్చుని ఏడుస్తూంది."

కృష్ణుడి మాటలు వినేటప్పటికి కోపంతో కఠినమయిన అతని హృదయం కరిగింది.

"పైగా యింట్లో డబ్బులేదు. బియ్యం పీరన్న, పాలసూరమ్మ, దాసీది, కోట్లు వాడు, అస్తమానూ బాకీలు యిమ్మని పీక్కు తింటున్నారు నాన్నా. యిన్నాళ్లీ నువ్వు యింటికివస్తావేమో అని చూసింది. నువ్వు రాలేదు అందుచేత చేతిలో మిగిలిన పావలా యిచ్చి నన్ను యిలా పడవ మీద పంపించింది"

"పాపం! ఏం యిబ్బంది పడ్డారో యిన్నాళ్ళు" అనుకున్నాడు సత్యనారాయణ. ఇంతకీ ఒక చిన్న విషయంపై తాను అన్యాయంగా జానకమ్మను బాధపెట్టానని నొచ్చుకున్నాడు....

ఆరోజు, ఆఫీసు పనిమీద తిరిగి తిరిగి రాత్రి యింటికివచ్చాడు సత్యనారాయణ, గుమ్మంలో నుంచుని ఎప్పుడూ నవ్వుతూ ఆహ్వానించే జానకమ్మ ఆ వేళమాత్రం ముడుచుకునిఅని కూర్చుంది.విస్తట్లో అన్నం పెట్టి అడిగింది.

"రెండెకరాల భూమి అమ్మేశారుట కదూ!"

"ఎవరు చెప్పారు"

"ఎవరో చెప్పడమేమిటి ఊరంతా అనుకుంటూంటే"

"ఈ ఆడముండలకు మరోపనిలేదు."

"అబద్ధా లాడ్డ మెందుకు?"

"ఎవరు?"

"మీరే... పిల్లలు ఎదుగుతున్నారు. బోలెడు ఖర్చు ముందువుంది. యిలా భూములు అమ్మకుంటూంటే సంసారం బాగుపడినట్లే"

"చాల్లే నువ్వు నాకేమీ సలహా లివ్వనక్కర్లేదు"

"యిల్లాగే అంటూండండి, చివరికి ఆస్తి అంతా తగులడ్డాక పిల్లలు ముష్టి ఎత్తుకునే దాకా తెలిసిరాదు"

"చాల్లే! నోరుముయ్యి"

"ఆ పేకాట మానకూడదూ,మీ కోదండం పెడతాను" రుస రుసలాడింది జానకమ్మ.

సత్యనారాయణ కోపం ఆగలేదు. కండి కంచంలోని అన్నం గిరవాటేసి, ఛెళ్ళున జానకమ్మ దవడ మీద కొట్టాడు. జానకమ్మ కన్నీళ్ళు కుక్కుకుంటూ ఏడ్చింది. జేబులో ఉన్న రూపాయినోట్లు ఆమె మీద విసిరేసి, తక్షణం పంచి,కోటు తొడుక్కుని సైకిలు తీసుకుని, అర్ధరాత్రి కోటిఫలి వచ్చేశాడు.

జరిగిన సంగతి కంటి ముందు తిరిగింది. తప్పెవరిది? సత్యనారాయణ ప్రశ్నించుకుని పశ్చాత్తాప పడ్డాడు. భూమి అమ్మినమాట వాస్తవమే. డబ్బు అరువుపెట్టి పేకాట ఆడాడు. ప్రతీసారి ఓడిపోయాడు. మూడువేలు బాకీపడ్డాడు. ఒకరోజు పేకాట ఆడుతూంటే స్నేహితులందరూ నానామాటలు అన్నారు. "ఎంతకాలం యిలా అరువుమీద పేకాడతావు. ఆడబ్బు తే పివ్వకపోతే మాట దక్కదు"ని. సత్యనారాయణకు ఉక్రోషం ఉడుకుమోతుతనం వచ్చి, భూమి అమ్మేసి, బాకీలు తీర్చగా, మిగిలిన డబ్బు ఆరోజు రాత్రి జానకమ్మపై విసిరేశాడు.

తను భూమి అమ్మిన సంగతి జానకమ్మకు తెలియకూడదనుకున్నాడు. తెలిసినందుకు చాలాకోపం వచ్చింది. ఆమె రట్టించి

(56 వ పేజీ చూడండి)

# కన్నకడుపు

వెంకయ్య అసలే జవసత్వాలుడిగిన మనిషి. పైగా ప్రొద్దుటనుంచి అల్లుడి గారింటికోసం ఆ పట్టణమంతా గాలించటంవల్ల ప్రాణం కడబట్టిపోయింది. నిప్పులు చెరిగే ఎండలో వేగలేక విసిగి వేసారి ఒక వేపచెట్టు నీడనజేరాడు. తిరగలేక కూర్చున్నాడన్న మాటేగాని వచ్చేపోయేవారందర్ని వదలకుండా 'ఫలానా వారిల్లు తెలుసా' అని ఓపికగా అడుగుతూనే వున్నాడు. కాకినాడలాంటి పట్టణంలో పేటపేరు, వీధి పేరు తెలియకుండా ఎందర్నడిగి ఏం ప్రయోజనం? అందులో ఈకాలంలో ఏడు దశాబ్దాలు గడిపిన వెంకయ్య గోడవ వినేవారెవరు? భార్య వాళ్ళ మేనమామ గారింటికి వెళ్ళానని బయలుదేరింది. ఆమె తిరిగిరావటానికి కనీసం మూడురోజులైనా పట్టుతుంది. ఈ లోగా తాను ఒకరోజు కూతురు ఇంటివద్ద వుండి, భార్యకంటె ముందుగానే ఇంటికి చేరుకోవచ్చుగదా అని ఆలోచిస్తున్నాడు. సరిగ్గా అదే సమయానికి చిన్నపిల్లల జట్టొకటి ఆచెట్టు క్రిందకు వచ్చింది. అలవాటు కొద్దీ "రామారావుగారిల్లు తెలుసా నాయనా" అని ఆపిల్లల నడిగి చూశాడు.

"మానాన్నగారింటిలో లేరం"టూ ఒక కుర్రవాడు దూసుకొచ్చాడు గుంపులోనుంచి శరీరం గగుర్పొడిచింది. బాణంలా. ఆ పిల్లవాడ్ని చూడంగానే వెంకయ్యకళ్ళల్లో ఏదో తళుక్కుమంది. ముఖం విప్పారింది. గట్టిగా గాలి పీల్చాడు. ఒంటిలో రక్తం వేడెక్కింది. కళ్లు చెమ్మగిల్లాయి. భాస్కరుని తటాలున చంక చేసుకున్నాడు. ముఖమంతా ముద్దెట్టుకున్నాడు. ఇంకా తనివిదీరక తల నిమురుతూ "ఇంటికి పోదాంపద బాబూ." అంటూ బయలుదేరాడు. తాను కేరింతలు కొడుతూ ఊయల ఊగే రోజుల్లోగూడా రానిమనిషి, తనస్మృతి పథానికి ఎక్కడా అందని వ్యక్తి అంత చొరవతో ఎత్తుకొనేసరికి భాస్కర్ కలవరపడి గింజుకోసాగాడు. వాళ్ళగడపదగ్గరకు రాగానే బలవంతంగా క్రిందికి జారి లోనికి ఉడాయించాడు. వంటింట్లోకెళ్ళి వాళ్ళమ్మతో ఎవరో వచ్చేరని చెప్పాడు.

"వచ్చినవారిని కూర్చోమనకుండానే ఇలా రావచ్చా" అంది గంజి వార్చుతూ కమల. ఆమాట వెంకయ్యకు షాక్‌లా తగిలింది. భయం మెలికలు త్రిప్పింది. వరండాదాకా వచ్చిన వెంకయ్య ముందుకడుగేయలేకపోయాడు. "నేనని తెలిస్తే ఈ విధంగా గౌరవిస్తుందా? అసలు గడపైనా తొక్కనిస్తుందా? ఇప్పుడైనా తగిన శాస్తి చేయించకవూరుకుంటుందా? ఆనాడు కాళ్ళావేళ్ళాబడి ఏడ్చినా కనికరించకుండా నే పెట్టిన ఇడుములన్నీ ఇంతలోనే మర్చిపోతుందా?" అని పరిపరివిధాల ఆలోచిస్తూ కిందుమీదవుతున్న వెంకయ్య తన్ను తానే నిలదీసి ప్రశ్నించుకుంటున్నాడు. అవును. అది నిజమే. స్వార్థం, ద్వేషం, నిర్దయ, అసూయ, కులం, మతం, గౌరవం, సాంప్రదాయం, ఆచారం అనే పడిగట్టు

శ్రీ ఈదర
సాంబశివరావు

పదాలతో ఊరేగుతున్న సంఘాన్ని ఎదిర్చి నిస్స్వార్థం, దయ, పరస్పరానురాగం స్వచ్ఛమైన ప్రేమ నేవి సంఘర్షిస్తున్న ఈకాలంలో కమల నవనీతహృదయం, ప్రతిఫలాపేక్ష లేని పవిత్ర ప్రేమ, అమాయకత, తల్లితండ్రుల యెడల ఆమెకున్న భక్తిశ్రద్ధలు అర్థం జేసుకొనే శక్తిసామర్థ్యం ఎందరికుంటుంది? అందులో అజ్ఞానంతో, అవివేకంగా స్వార్థపరులు కల్పించిన కుటిలనీతులే పరమావధియని భావించి, శ్లాఘించి, పూజాపునస్కారాలతో కాలంగడిపే తనకు అంత తేలిగ్గా అర్థమవుతాయా ఈవిషయాలన్నీ.

భాస్కర్ కొంగుపట్టుకొని లాక్కొస్తున్న కమలను కిటికీగుండా చూచేసరికి వెంకయ్యకు హృదయం బరువెక్కి క్రుంగిపోయాడు. గొంతు తడి ఆరింది. మాటజీరపోయింది. అమ్మా అంటూ చేతులు జాచి ప్రతిమలా నిలబడిపోయాడు. కళ్ళవెంట నీరు కట్టతెగిన ఏరులా ప్రవహిస్తున్నది. తండ్రి తన ఇంటికివస్తాడని కమల కలలో గూడ అనుకోలేదు. వెంకయ్యనుచూడగానే కమలకళ్లు జిగేల్‌మన్నాయి. తన్ను తానే నమ్మలేకపోయింది. దుఃఖం పొర్లుకొచ్చింది. 'నాన్నా' అని వెర్రికేక పెట్టి రివ్వునపోయి తండ్రిమీద వ్రాలింది. అసలు సంగతేమిటో అర్థంగాని భాస్కర్ ఏడ్పు లంకించుకున్నాడు.

"ఏడవకమ్మా ఏడవకు. ఈకఠినుడిహృదయం నేటికి కరిగింది" అని కూతురు తలనిమిరి కన్నీళ్లు తుడిచాడు. మనుమణ్ణి దగ్గరకు తీసుకొని బుజ్జగించాడు. విపరీతంగా వచ్చిన దగ్గుపొర వెంకయ్యను మంచంమీద కూలేసింది. కొంచెం సేదతీర్చుకున్న తర్వాత స్పృహలోకి వచ్చాడు వెంకయ్య. చిటికెలో వంటజేసి భోజనం వడ్డించింది కమల. భుజిస్తున్నంతసేపు వెంకయ్య ఏదో కొత్త రుచిని, అనిర్వచనీయమైన ఆనందాన్ని అనుభవించాడు. ఎదురుగా కూర్చున్న కమల ఇరుగుపొరుగుల క్షేమసమాచారం సేకరిస్తూ, పనివానిలా తినిపిస్తుంటే, వెంకయ్యకు బొందితోనే స్వర్గంపొందినట్లుంది. మంచంమీద మేనువాలుస్తూ అల్లుడివిషయం అడిగాడు. ఉద్యోగంకోసం తిరుగుతూ ఎవరినో కలుసుకోవాలని వెళ్ళారని, సాయంకాలానికి వస్తారని చెప్పింది కమల.

బెరుగ్గా చూస్తున్న భాస్కర్‌ని దగ్గరకు తీసుకొని "నేనాట్టే కూర్చోలేనమ్మా. సంవత్సరన్నరనుంచి దగ్గు నన్నుపీల్చి పిప్పి జేస్తోంది. మీ అమ్మను జాడ్డామా అంటే దానికి కాళ్లు చేతులు పడిపోయినాయి. మంచానబడ్డ ఈరోజుల్లో మా సేవజేసేదెవరు చెప్పుతల్లీ? ఏనుయ్యో గొయ్యో చూసుకుందామా అంటే, కన్నకడుపు ఈఅఘాయిత్యానికి అడ్డు తగిలిందమ్మా. నీవు ఇల్లు విడిచిన నాటినుంచి కన్నకూతుర్ని దూరం జేసుకున్నానే అని ఏలా కుమిలి కునారిల్లి, కృంగి కృశించిపోతున్నానో ఆ పరమాత్ముడికే తెలుసు. మీ అమ్మ విషయం వేరే చెప్పనక్కరలేదు. అది ఏడవని రోజంటూలేదు. నిన్ను జుట్టుపట్టుకొని వీధి కీడ్చిన రోజున, కులసాంప్రదాయాల సంరక్షణకోసం నే జేసిన పని సమర్థనీయమేనని సంతోషించాను. కాని అదంతా దగా మోసం అని ఆనాడు తెలుసుకోలేకపోయాను. ఎందుకులే తల్లీ? కడుపు చించుకుంటే కాళ్ళమీదే పడుతుంది. నిన్ను ఇన్ని కష్టాలకు



"నే నిక్కడికి దొంగచాటుగా రావాల్సి వచ్చిందే అమ్మా!"

నురిజేసిన నేను, నా ముఖం ప్రజలకు చూపెట్టలేనమ్మా. ఇదే నాకడసారి కోర్కె తల్లీ. కడసారి మిమ్మల్ని జూచి, మీ క్షేమ వార్త చెవి వేసుకొని నాదారి నే జూచుకుందామని" అంటూ భోరు నేడ్చాడు.

కమలకు హృదయం తరుక్కుపోయింది. "కంటికి రెప్పలా కాపాడే నీ కమల చచ్చిపోయిం దనుకున్నావా నాన్నా? ఈవృద్ధాప్యంలో నీ వెలా వున్నావో తెలియక నేనెంత పరితపించిపోతున్నాను. నా పంట పండి నీవే వచ్చావు. నా కంతకన్నా ఇంకేం గావాలి. రేపే అమ్మకు కబురంపిస్తాను" అని తండ్రికి కాళ్లొత్త నారంభించింది కమల. తండ్రి ఆవలించి చిటికె వేస్తూ కన్ను మూశాడు.

కాని వెంకయ్య బుర్రలో ఏదో కెలుకుతున్నట్లుంది. కులపెద్దలమాట లెక్క జేయక సాటికులంవాణ్ణి కాదని, తక్కువకులంవాణ్ణి చేసుకుందని, ఇది వంశప్రతిష్ఠకే భంగమని, కులానికే అప్రతిష్ఠ అని, ధర్మానికే ముప్పమని చెప్పి, వెలివేస్తామని బెదిరించి, కన్న కూతుర్ని ఇంట్లోనుంచి వీధి కీడ్పించిన పెద్దలు, బంధుమిత్రులు ఈనా డేమయారు? ఏణ్ణర్థంనుంచి అతను మంచంలోబడి తీసుకుంటూ వుంటే ఒక్కడైనా తిరిగి చూచిన పాపానపోలేదే? ఏపాప మెరుగని కమలపైన విముఖత గలిగేవరకు పనిగట్టి పోరాడిన పెద్దలందరూ అతనికి కాలు చేతు లుడిగి మంచానబడితే చేయవల్సిన సాయమింతేనా? "నీ కూతురు జేసిన పని సాటికులం వాళ్ళకు తలవంపు గాదా" అని బజార్లో నిలదీసి అడిగిన పెద్దలకు, సాటి కులంలో ఒకడు పిలిస్తే పలికే దిక్కు లేక మంచంలో కుళ్లి కుళ్ళి మురిగి మరణిస్తే తలవంపు కాదా? కులప్రతిష్ఠకోసం తెగించి కన్నకూతుర్ని శిక్షిస్తే ఆ ప్రతిష్ఠ నిలిపేందుకైనా ఈ నిస్సహాయునికి సాయపడే బాధ్యత కులం కులమని చెట్టుక్రింద గొంతులు చించుకొనే ఆ పెద్దలకు లేదా? కులగౌరవం కబుర్లతోనే కాపాడబడుతుందా? వీళ్ళు జెప్పిన ప్రతిమాటకు చెవొగ్గి కన్నకూతుర్ని పదేండ్లనాడు నానా దుర్భాషలాడి ఇంటి నుండి తరిమివేశాడు. పచ్చని కాపురానికి చిచ్చుపెట్టి ఈనికృష్ట స్థితికి తెచ్చారు ఇరుగుపొరుగులు. మూర్ఖత్వం, పట్టుదల,

(56 వ పేజీ చూడండి)

# అన్యాయం

"ఒక్క పిల్లాడైనా పెంచుకోకపోతే ముద్దూ ముచ్చటా తీరేదెలాగండీ" అన్నది పార్వతి నెమ్మదిగా, సాంబయ్య భోజనం చేస్తున్న సమయంలో. "అదే నేనూ ఆలోచిస్తున్నాను" అన్నాడు సాంబయ్య. కాసేపూరుకున్నది పార్వతి. "మరెవ్వరున్నారు చెబుదూ" అన్నాడు సాంబయ్య భార్యవంక చూస్తూ. "ఆ, మనం పెంచాలేగాని ఎవరూ దొరక్కపోతారా? మీ బాబాయిగారి నాగులున్నాడు మూడండి. వాడికొక కొడుకు. ఎంత ముచ్చటగా ఉన్నాడనుకున్నారు. నేను నిన్ననే ఎందుకో అటు పోయి చూచివచ్చాను"

"వాడికీ ఒక్కడేగదే, మనకి పెంచుకోడానికిస్తాడా?" అని సందేహం వెల్లిబుచ్చాడు సాంబయ్య. "ఆ, అసలే దరిద్రులు. ఇంకా వాళ్ళకీపిల్లడెందుకులెండి. ఐనా వాళ్ళకింకా పిల్లలు పుట్టకుండా ఉంటారా? పోనీ అందాకా ఈ పిల్లాడే మనింట్లోనూ, వాళ్ళింట్లోనూకూడా మసులుతుంటాడని చెబుదాం. అందాకా ఎందుకు. నాగుల్ని, వాడి పెళ్లాన్ని కూడా తీసుకొచ్చి మన యింటికెదురుంగా ఒక చిన్న పాక వేయించి, అందులో ఉండమంటే సరి. అన్నీ కలిసొస్తాయి. అటు అది నీకు తోడుగా ఉంటుంది. నాగులు నాకు వ్యవసాయంలో సాయంగా ఉంటాడు. పిల్లాడు మనింట్లోనే వుంటూంటాడు. అందుకనే యీ పూటో రేపో యీ విషయంలో నాగుల్ని కదిలించాలనుకుంటున్నాను" అన్నాడు సాంబయ్య భోజనం ముగిస్తూ.

"ఐతే అందుకు నాగు లొప్పుకుంటాడా"

"వాడొప్పుకోకేం చేస్తాడు. ఒళ్ళరిగేటట్టు పని చెయ్యడం తప్ప వాడికేం తెలియదు. అందులోనూ నేనెట్టా అంటే అట్టా. ఎట్టాగొట్టా పొట్టపోసుకునే వాళ్ళని తీసుకుపోయి మేపుతా మంటే వాళ్ళకేం దిగులా?"

"సరే, కానివ్వండి"

సాంబయ్యది కొంచెం ఘరానా కుటుంబం. పెద్దలతాతల కాలంలో బాగా సంపన్నులని అంటారు. తండ్రినుంచి పంచుకున్నదాంట్లో సాంబయ్య తండ్రి కొంచెంకూడా ఖర్చు పెట్టకపోగా యింకా కూడబెట్టాడు. నాగులు తండ్రిమాత్రం తన ఆస్తినాశనం చేసుకున్నాడు, తత్పర్యవసానంగా సాంబయ్య ధనికుడు, నాగులు నిరుపేద అయ్యారు. నిజానికి యిద్దరూ అన్నదమ్ముల బిడ్డలే. ఐనా సాంబయ్య ఎన్నడూ నాగుల్ని పలకరించేవాడు కాడు. ఏదో అతను కాస్త ఉన్నవాడు కదా అని నాగులు అనుకుని ఊరుకున్నాడు.

ఇంత ఆస్తి ఉన్నా సాంబయ్యకు పిల్లలు లేరు. అందుకే ఎవరినైనా పెంచుకోవాలని భార్యాభర్తలిద్దరూ ఏకగ్రీవంగా తీర్మానించుకున్నారు. నాగులుకు మాత్రం ఒక మగబిడ్డ.

నిర్ణయానుసారం నాగుల్ని కలుసుకోవాలనుకున్నాడు సాంబయ్య. కాని రెండు రోజులదాకా ఎక్కడా తటస్థపడలేదు నాగులు. మూడోరోజు తన ఒక్క అరకుండ పొలంలోనూ నాగులొక్కడే పని చేసుకుంటుండగా చూశాడు సాంబయ్య. సాంబయ్య తన వంక రావడం చూశాడు నాగులు. తన కెందుకులే అని ఊరుకున్నాడు.

"ఏరోయ్ నాగులూ! ఎక్కడా అగుపించడం లేదు" అన్నాడు సాంబయ్య.

"అదేమిటి సాంబయ్యన్నా! నేను రోజూ పొలంలోకి వస్తున్నాగా" అన్నాడు నాగులు ఆశ్చర్యాన్ని దిగమింగుతూ.

నిజంగా సాంబయ్య పలకరించినందుకు ఆశ్చర్యమేసింది నాగులికి. కాని ఎలాగైనా అన్నయ్యగా! అన్నదమ్ములబిడ్డలు. ఆమాత్రం పలకరించకుండా ఉంటాడంటలెద్దూ. అని సమాధాన పరుచుకున్నాడు. ఐనా అన్నదమ్ముల బిడ్డలైనతా మిద్దరిలోని నిమ్నోన్నతాలను తల్చుకుని నాగులు తల వంచుకున్నాడు, యజమాని ముందు నౌకరులాగా.

"అలా నేలకేసి చూస్తావేరా నావంక చూడు. ఒక్కమాట" అన్నాడు సాంబయ్య. నాగులు ధైర్యం తెచ్చుకొని సాంబయ్య మొఖం వంక చూశాడు. ఆ బారులుతీరిన మీసాల్లోంచి చిరునవ్వులు తొంగిచూడడం గమనించాడు. "ఏమిటి సాంబయ్యన్నా" అని ప్రశ్నించాడు నెమ్మదిగా.

"చూడు నాగులూ మనమిద్దరం అన్నదమ్ముల బిడ్డలం. ఎవరి ఖర్మ లెలా ఉన్నా ఒక గూట్లోవాళ్ళం. అలాంటప్పుడు తిండికి చాలక నువ్వు నానా అగచాట్లు పడుతూ పరుల పంచను జీవిరిస్తూ ఉంటే నేను చూడలేకుండా ఉన్నాను. మా యింటి పక్కనే పాక వేయించాను. అందులోనే ఉంటూ మమ్మల్నే కనిపెట్టుకుని ఉండు. పార్వతికూడా అదే చెప్పమంది" అన్నాడు సాంబయ్య ఆప్యాయంగా.

కాసేపు మౌనంగా ఊరుకున్నాడు నాగులు ఆలోచిస్తూ.

"ఏమంటావ్ నాగులూ. నువ్వుండేది కూడా నీ సొంత కొంప కాదు. ఎవరినో జీవిరించే బదులు నాదగ్గరే ఉండొచ్చుగా" అన్నాడు రెట్టిస్తూ సాంబయ్య. ఆ కోర మీసాల్లో ఇంత కారుణ్యం ఉందా అని సంశయించాడు నాలుగు. ఐనా వెంటనే నాగులికి తన కష్టాలన్నీ గుర్తుకు వచ్చాయి. తిండికి చాలదు. పసిబిడ్డను పోషించడం కష్టం. పైగా తనుండేది యితరుల యింట్లో. ఏనాడు అర్ధంతరంగా వాళ్లు లేచి పొమ్మంటారో - పైగా తన నాహ్వానిస్తున్నది సొంతన్న కాకపోయినా పెదతండ్రి కొడుకు. సరే అని అందామనుకున్నాడు. ఇంతలోనే ఏమిటిరా నీ ఆలోచన అని మరో రెట్టింపు వచ్చింది. ఏమైనా బెట్టు చూపాలనుకున్నాడు నాగులు. "ఆడ జేమంటుందో సాంబయ్యన్నా!" అన్నాడు నెమ్మదిగా.

అది మాత్ర మేమంటుందిరా పిచ్చి సన్నాసి, సుఖంగా బ్రతకడం దానికి మాత్రం యిష్టం కాదూ!

"సరేలే సాంబయ్యన్నా!" అన్నాడు చిట్టచివరికి నాగులు. "సరే అంటే కాదు. ఇవ్వాళే వచ్చి పాకవేసుకో. తాటాకు వాసాలు అవీ తెప్పించి ఉంచాను. మధ్యాహ్నం వస్తావుగా" అన్నాడు సాంబయ్య. తేలిక పడిన మనస్సుతో "సరేలే" అని పొలంలోకి వంగాడు నాగులు. కండలు తేరిన అతని శరీరాన్ని చూస్తే సాంబయ్యకు ధైర్యం కలిగింది. వీడు తన పక్షాన

ఉండగా ఊళ్లో ఇక తన నెదిరించేవాళ్లే లేరని. 'వస్తారా' అని చెప్పి ముందుకు సాగాడు సాంబయ్య, స్వార్థాన్ని బయట పెట్టకుండా నాగుల్ని దయ చూపిస్తున్నట్టుగా. తనింటికి తెచ్చుకున్న తన తెలివి తేటలికి కులుక్కుంటూ.

కష్టపడి పాక తయారు చేసుకున్నాడు నాగులు సాంబయ్య ఇంటి కెదురుగానే. మంచిరోజున గృహప్రవేశంకూడా చేశాడు భార్యా బిడ్డలతో. గృహప్రవేశం రోజున ఊళ్లో నలుగురినీ పిలిచి భోజనాలు కూడా పెట్టించారు. అందుకుగాను ఖర్చంతా సాంబయ్యే భరించాడు. భోజనాలకు వచ్చిన పెద్దలు సాంబయ్య సోదరప్రేమను మెచ్చుకున్నారు. 'సాంబయ్య యింతమంచి వాడనుకోలేదురా' అన్నాడు ఒక ఆసామీ ప్రక్కవాని చెవులో. 'మన కెందుకులే' అన్నట్టుగా ఊరుకున్నాడు రెండోఆయన.

నాగులు పరిస్థితికూడా యిప్పుడు బాగానే ఉంది. తిండికీ, ఉంటానికి లోటు లేకుండా పోయింది. బిడ్డని గురించి అసలు బెంగలేదు. ఇద్దరిళ్ళలోనూ మురిపెంగా పెరుగుతున్నాడు. అటు పార్వతి ముద్దూ మురిపెంకూడా తీరాయి. సాంబయ్య బాధ కూడా తొలగిపోయింది. ఎలాగైనా కష్టపడి సేవచేసి అన్నపట్ల తన ఋణం తీర్చుకోవాలనుకున్నాడు నాగులు. పెళ్ళాంతో కూడా అదేమాట చెప్పాడు. "మావదిన నిజంగా పార్వతే" అని పొగిడాడు. 'అన్నయ్యకూడా నిజంగా దయాసముద్రుడ'ని పొంగిపోయాడు. పొలం భారమంతా వాడిమీద పడేస్తే తన కష్టం తీరుతుందికదా అనుకున్నాడు సాంబయ్య. నాగులు నమ్మిన బంటులా కనిపించాడు సాంబయ్యకి.

"ఒరేయ్ నాగులూ" అని పిలిచాడు సాంబయ్య భోజనంచేసిన తర్వాత అరుబయట నుంచంమీద కూర్చుని ఓనాటి రాత్రి. నాగులు నెమ్మదిగా దగ్గరికివచ్చి నిలబడ్డాడు. "కూర్చోరా" అన్నాడు సాంబయ్య. కొంచెం సంశయించినా నాగులు మొత్తంమీద కూర్చొబడ్డాడు సాంబయ్యకు కొంచెం దూరంగా. సాంబయ్య అప్పుడే చుట్టిన చుట్టమొన తుంపేస్తూ "నాగులూ చాలారోజుల్నుంచి ఒకమాట చెబుదామనుకుంటున్నాను". అన్నాడు. "చెప్పు సాంబయ్యన్నా" అన్నాడు నాగులు. "పెద్ద పాలేరును పని లోంచి తీసేశాను. వాడికి కళ్ళు నెత్తిమీదికొచ్చాయి. చెప్పినమాట వినడంలేదు." అన్నాడు సాంబయ్య. 'ఔను' అన్నాడు నాగులు ముక్తసరిగా.

"ఎలాగో నువ్వున్నావుగా అని మరో



..ను పొలంచుట్టూతిరగలేను. నా పొలం అంతా నువ్వేచూస్తుండు. అగ్రహారప్పొలం నువ్వే పండించుకో. అందులో నాకేమీ యివ్వద్దులే.

పాలేరును పెట్టలేదు. చూడు నాగులూ. నేనిక పొలం చుట్టూతిరగలేదు. నా పొలమంతా నువ్వేచూస్తుండు. అందుకు అగ్రహారప్పొలం నువ్వే పండించుకో. అందులో నాకేమీయివ్వద్దులే" అన్నాడు సాంబయ్య చుట్టవెలిగించి. తనే చెప్పాలనుకుంటున్న విషయాన్ని సాంబయ్య తనకే చెప్పేసరికి నాగులికి అపరిమితమైన సంతోషం కలిగింది.

"ఆ మాట నువ్వు చెప్పాలా సాంబ

#  అన్యాయం 

య్యన్నా! నువ్వు చేసిన సాయానికి నేను నీకేమైనా చేసిపెట్టగలను" అన్నాడు నాగులు. సాంబయ్య కూడా సంతోషాన్ని వెలిబుచ్చాడు ముసిముసి నవ్వుల్తో. నాగులు నెమ్మదిగా ఇంట్లోకి చేరాడు అన్నదగ్గర సెలవుపుచ్చుకొని.

నాగులు ఇంట్లో ప్రవేశించేసరికి పెళ్లాం నుక్కి మంచంమీద పడుకుని ఏడుస్తోంది. నాగులకేమీ తోచలేదు. ఎందుకలా ఏడుస్తోందో అర్థం కాలేదు. సంతోషకరమైన వార్తని పెళ్ళానికి చెప్పాలని ఉబలాటపడ్డాడు నాగులు. కాని ఏమని పలకరించాలి? ఎందుకో ఏడుస్తున్నట్టుంది.

"ఎందుకే ఏడుస్తున్నావ్" అన్నాడు మనస్సు చిక్కబట్టుకుని నాగులు. జవాబు రాలేదు. దగ్గరగా వెళ్ళి "ఎందుకూ ఏడుస్తున్నావ్ లక్ష్మీ" అన్నాడు నాగులు. నెమ్మదిగా లేచింది లక్ష్మి.

"ఏమీ లేదండీ. మనబ్బాయిని మనక్కాకుండా చేస్తున్నారు వాళ్ళు అన్నది.

ఎవరు? అన్నాడు నాగులు. "ఇంకెవరున్నారు మీ అన్న, వదినగారు." అన్నది లక్ష్మి. "ఓసి పిచ్చిదానా! అందుకేనా! పిల్లల్ని చూస్తే ఎవరికైనా ముద్దే" అన్నాడు నాగులు. కాని లక్ష్మి సంతృప్తి పడలేదు.

"ఎప్పుడూ నాదగ్గరికి రానివ్వడం లేదు. ఎల్లప్పుడూ తనే ఎత్తుకు తిరుగుతుంది. నన్నేమో పరాయిదానిలా చూస్తుంది. ప్రొద్దున్న లేచి ఎక్కడెక్కడో తిరిగొస్తే మీకేం తెలుస్తుంది" అన్నది లక్ష్మి.

"అఁ వాళ్లేం చేస్తే మాత్రం వాడు మనవాడు కాకుండా పోతాడా"

"మీకేం తెలుస్తుంది నా బాధ" అన్నది లక్ష్మి మూలుగుతూ.

"నాగులు భోంచెయ్యడానికని కాళ్ళు కడుక్కోడానికి దొడ్లోకి వెళ్ళబోయాడు. ఇంతలోకే "ఒక్క మాటండీ" అన్నది లక్ష్మి. మళ్లీ లక్ష్మివైపుకు తిరిగాడు నాగులు. "ప్రొద్దున్న మీ వదినగారింటికి ఎవరో చూడటానికి వచ్చారు. వాళ్ళతో మా అబ్బాయి. మేం పెంచుకుంటున్నాం అని చెబుతోంది. నేను చాటుగా విన్నాను." అన్నది లక్ష్మి కళ్లనీళ్లు తుడుచుకుంటూ. నాగులికూడా బాధ కలిగింది. కాని అన్న తనకు చేసిన మేలు గుర్తు వచ్చేసరికి ఏదో ఊరికే అంటుందిలే అనుకున్నాడు.

పోనీలేవే. మనమీద స్వతంత్రంకొద్దీ అలా అని ఉంటుంది కాని మరేమీ కాదు. ఇంతలోకే ఏంమునుంచుకుపోలేదు" అన్నాడు నాగులు నెమ్మదిగా.

"ఎంత లేకపోయినా ఆ మాత్రం బిడ్డకి కూడుపెట్టుకోలేమా అండి" అన్నది ఏడుస్తూనే లక్ష్మి. నాగులు ఇక లాభం లేదనుకుని దొడ్లోకి వెళ్ళిపోయాడు. నిద్ర పోతున్న బిడ్డవంక నెత్తిగా చూచి కళ్ళనీళ్ళు తుడుచుకుంటూ అన్నం వడ్డించడానికి వంటగదిలోకి వెళ్ళింది లక్ష్మి. ఇక ఆ సంతోషకరమైన వార్తని ఇప్పుడు చెప్పినా లాభం లేదనుకున్నాడు నాగులు.

రోజులు గడిచిపోతున్నాయి. అన్న వ్యవసాయమంతా నాగులు తనే చూడసాగాడు. అంతా తనదే అన్నట్టుగా కృషి చేశాడు. రాత్రింబవళ్లు పనిచేశాడు. ఆ పొలాలనన్నిటినీ తన చెక్కనీ, తనకన్న యిచ్చిన చెక్కనీకూడా చూసుకుంటూ వచ్చాడు. నాగులు బాగాపనిచేసినందువల్లనైతేనేం, లేక కాలంతీరున ఐతేనేం పంటలు బాగాపండాయి. రైతులకు వీళ్ళ చేలుచూస్తే కన్నులపండువుగా ఉన్నాయి. నాగులు మంచిరోజు చూచి చేలన్నీ కోయించి కుప్ప వేయించాడు. కుప్పల్ని చూచి పొంగిపోయాడు నాగులు. తన కష్టాలకు ఇవి చిహ్నాలు. అన్నతనకిచ్చిన చేనులో కుప్పదగ్గరికి వెళ్లాడు అది సంవత్సరం పొడుగునా తన కష్టానికి ఫలితం. ఆనందంలో నవ్వుకున్నాడు లోలోపల.

దాదాపు సంవత్సరంలోగా చాలా విషయాలు జరిగిపోయినాయి. పార్వతి గర్భవతి ఐంది. నెలరోజులక్రితమే మగపిల్లడు పుట్టాడు. ఇప్పుడు పార్వతీ సాంబయ్యల ఆనందానికి మేర లేదు. కాని నాగులు కొడుకుమీద పార్వతికి యిష్టం పోయింది. వాడిబలమైన శరీరాన్ని చూస్తే పార్వతికి ఈర్ష్య కలిగింది. వాడి రూపురేఖల్ని, ఆటపాటల్ని చూసి పార్వతి అసూయతో సహించలేకపోయింది.

ఓరోజున సాంబయ్య భోజనంచేస్తుండగా "చూడండి, ఇంకా మనకి ఆ తగలాటం ఎందుకు. ప్రతిదానికి నేనేనంటూ ఆ నాగులు పెళ్లాం చేతికి అడ్డొస్తోంది. తానే యింటికి యజమానురాలన్నట్టుగా ప్రవర్తిస్తోంది. మీకేం తెలుస్తుంది. ప్రొద్దున్నేపోయి బజారుల్లో తిరిగివస్తారు సాయంకాలానికి" అన్నది పార్వతి. అభిమానంతో కొంత తటపటాయించినా ఏమీ మాట్లాడలేకపోయాడు సాంబయ్య. పార్వతి మళ్లీ రెట్టించింది. "సలక్షణంగా మనకి పిల్లవాడున్నాడు. ఇంకా దిష్టిబొమ్మలాగా ఆకుర్రవాడెవడు మనకెందుకు. పైగా వాళ్ళకోసం ఎంత ఖర్చు. ఆ పొలంలో పంటంతా తీసుకోమన్నారటగా. అది మీ సొంతమా ఏమిటి? అది మానాన్న పెళ్ళికి కట్నంగా యిచ్చింది. నాది" అన్నది పార్వతి.

"పిచ్చిదానా! అందుకే దాంట్లో పంట తీసుకోమన్నాను. చూడు ఏం జరుగుతుందో" అన్నాడు సాంబయ్య.

సాయంకాలం నాగులు కుప్పనూర్చి వడ్లు బస్తాల కెక్కించాడు. భర్త కష్టఫలాన్ని చూడడానికి లక్ష్మికూడా బిడ్డతో సహా వచ్చింది కళకళలాడే మొగంతో. బస్తాలను బళ్ళకెక్కించే సమయంలో సాంబయ్య కేరగాళ్ళతో వచ్చాడు. "నాగులూ, ఈవడ్లు అమ్మేశాను. ఈ కేరగాళ్ళ స్వాధీనం చేసెయ్యి" అన్నాడు సాంబయ్య. నాగులు తల తిరిగిపోయింది. "ఈ పంట నాకిస్తానన్నారుగా" అన్నాడు నాగులు.

"ఓరి పిడుగా! అబద్ధాలాడి కాజేద్దామనుకున్నావా? సంవత్సరం పొడుగునా తేరగా తిన్నదికాక. ఇది నా చెక్కగాదు. పార్వతిది. దాని చెక్కలో పంట తీసుకోమంటానా, ఎంత మతిమరపైతేమాత్రం" అన్నాడు సాంబయ్య.

నేలకూలిపోయాడు నాగులు ఆమాటతో. లక్ష్మి బిడ్డతో సహా విలవిల ఏడుస్తూ భర్త దగ్గర కూర్చుంది. వడ్లని కేరగాళ్లు బళ్ళకెక్కించి తీసుకుపోతున్నారు. "నా రెక్కల కష్టాన్ని, రక్తపు ఫలాన్ని లాక్కుంటున్నాడు" అన్నాడు దీనంగా నాగులు. ఆ మాట వినిపించుకోకుండానే సాంబయ్య రెండడుగులు ముందుకేశాడు, ఇంటికి పోదామనే ఉద్దేశంతో. ఇంతలోనే రొజుకుంటూ పరుగెత్తుకొచ్చిన చిన్నపాలేరు, "సాంబయ్య దొరా! అబ్బాయి చచ్చిపోయాడు జ్వరంతో" అన్నాడు దిగాలుగా. సాంబయ్య కూలిపోయాడక్కడే. ★

# అన్నయ్య మనవాడే

'అన్నయ్య మనవాడే కాని, వదిన మన వదిన ఎలాగౌతుందిరా'— అన్నారు నాన్న.

'ఏమయినా అన్నయ్య మంచివాడు నాన్నా! వదిన సంగతి అలా వుంటే మనకెందుకు? అయినా అన్నయ్యను చూసి చాలా కాలమైంది.'

'ఏమో నీ యిష్టం, వెళ్ళినా వెంటనే తిరిగి వచ్చేయి'—అంటూ నాన్నగారు బయటకు వెళ్ళిపోయారు.

కాలేజీ మూశారు. ఇంటివద్ద ఏం తోచటంలేదు. పోనీ అన్నయ్యను చూసి చాలా కాలమైంది, ఒక్కసారి వెళ్లి చూసివద్దామనుకున్నాను, ఏమంటారో అని నాన్నగారి నడిగాను.

నాన్న ఒక పెద్దగాథ చెప్పుకొచ్చారు. 'వెళ్లినా నీ గౌరవం నీకు దక్కదన్నారు. 'వెళ్ళకపోవడమే మంచిద'న్నారు. చిన్నప్పటినుంచి అన్నయ్య నన్ను ఎంతో ప్రేమతో ఆదరించేవాడు. నా చదువు విషయంలో అన్నయ్య ఎంతో శ్రద్ధ చూపేవాడు. అయినా అన్నయ్య దగ్గరకు వెళ్ళడం గౌరవంకోసం కాదు, అన్నయ్యను చూడాలనే. నాన్న చెప్పినట్లు

**శ్రీ కేతినీడి నరసింహారావు**

'అన్నయ్య మనల్ని పూర్తిగా మర్చిపోయా' డంటె నాకు నమ్మకం కలగడంలేదు. తనని పెంచి పెద్దవాణ్ణి చేసి, చదువు సంధ్యలు చెప్పించి, ఈనాడు తాను ఉద్యోగం చేసి నాలుగు రాళ్లు సంపాదిస్తూ హాయిగా సంసారం చేసుకోడానికి కారకులైన నాన్నగార్ని అన్నయ్య అంత తేలికగా మరిచిపోతాడంటే, అంత చిన్నచూపు చూస్తాడంటే నేను నమ్మలేకపోయాను. అన్నయ్య అంత కృతఘ్నుడా?... అంత వివేక రహితుడా?...

అయినా అన్నయ్య ప్రవర్తన నాకు చిన్నప్పటినుంచీ బాగా తెలుసు, నాన్నగారంటె అన్నయ్య జడుస్తూనేవుంటాడు. నాకు జ్ఞాపకం వున్నంతవరకూ నాన్నగార్ని అన్నయ్య ఎప్పుడూ ఎదిరించలేదు కూడా. వదినెంత అయిష్టంగా చెబితే మాత్రం అన్నయ్య అంత తెలివితక్కువగా ప్రవర్తిస్తాడా?

అన్నయ్యకు ఉద్యోగమై కాకినాడ వెళ్లినతరువాత ఇంతవరకూ అన్నయ్యను చూడ్డమే పడలేదు. ఆ మరునాడే కాకినాడ బయలుదేరాను.

ఆరోజు ప్రొద్దున్నే కాకినాడ చేరేటప్పటికి, 10 గంటలయింది. అడ్రసు ప్రకారం అన్నయ్యగారింటికి వెళ్ళాను. నే వెళ్ళేటప్పటికి అన్నయ్య ఆఫీసుకి వెళ్లిపోయినట్లున్నాడు. హేండ్ బేగ్ డ్రాయరుమీద పెట్టి పడకకుర్చీలో కూలబడ్డాను. వదిన వచ్చి ఒకసారి నన్ను చూసి లోనకు వెళ్ళిపోయింది. కాస్సేపటికి వంటిది చెంబుతో నీళ్ళు తెచ్చి "కాళ్ళు కడుక్కో నాన్నా!"—అంది.

కాళ్ళుకడుక్కొని, మంచినీళ్ళుత్రాగి కుర్చీలో కూర్చున్నాను.

అరగంట, గంట గడచింది, లోనకు వెళ్ళిన వదిన తిరిగిరాలేదు. కడుపులో కాలిపోతోంది, కాఫీ నీళ్ళయినా పొయ్యలేదు. మంచీ, చెడ్డా అడగడం లేదు; పోనీ చివరకు పలుకరించడానికైనా పలుకరించలేదు. గడియారంవైపు చూశాను. 11 గంటలయింది. వంటిదాన్నడిగాను. "నాన్న ఎప్పుడొస్తారమ్మా?" అని. "ఒంటిగంట కొస్తారు"అంది మెల్లగా.

అన్నయ్య వచ్చేంతవరకూ అలా కుర్చీలో కూర్చోవలసిందేనా? అయినా వదినకు నేనంటె అంతకోపం ఎందుకు? ఆమెకు నేనేం అపచారం చేశాను? నాతో ఎందుకు మాట్లాడకూడదు?

కోపం దుఃఖం రెండూ ఒకదానివెంట మరొకటి ముందుకు తోసుకొస్తున్నాయి కంట్లమ్మట నీరు కొరేపర్యంతం వచ్చింది

నాన్న చెప్పనే చెప్పాడు. కానీ ఆయన మాట వినిపించుకోకుండా వచ్చాను. నాన్న చెప్పిన కథంతా తిరిగి నా చెవుల్లో గింగురు మంటూంది.

"చిన్నప్పటినుంచి ఎంతో ప్రేమతో పెంచాను. పెద్దవాణ్ణి చేశాను. ఒకవైపు బరువుగా సంసారంమోస్తూ, మరోవైపు కష్టపడి చదివించాను. వివాహం చేశాను. తిరిగితిరిగి పట్టరాని వాళ్ళ కాళ్ళుపట్టి ఉద్యోగం వేయించాను. ముందువచ్చిన చెవులకంటె వెనుకవచ్చిన కొమ్ములువాడి అన్నట్లు—ఇంతచేసిన నన్ను, పోనీ నన్ను తండ్రిగానైనా గుర్తించలేదు. తండ్రి కివ్వవలసిన గౌరవంకూడా యివ్వలేదు. భార్య మాటలకు లోనై ఆత్మస్వాతంత్ర్యాన్ని చంపుకుని అసభ్యంగా ప్రవర్తించాడు. ఆమెకు నేనేం అపచారం చేశానో, ఏమో నామీద ఆమె కెంతో కోపం. ఆమె వాడికేం చెప్పి నూరిపెట్టిందో, వాడు నన్ను చూస్తే చిరచిరలాడతాడు. ఉద్యోగంలో చేరి సంవత్సరమైంది. ఒక్క కానీకూడా యింటికి పంపలేదు. పంపించకపోతేమానె, ప్రతీనెలా ఉత్తరంమీద ఉత్తరం" నాన్నా! డబ్బుకు చాలా బాధపడుతున్నాను. వచ్చే నెల జీతం పదిహేనురోజులకే సరిపోవటం లేదు. వెంటనే డబ్బు ఏమైనా పంపించండి—"ఇదీ వాడువ్రాసే ఉత్తరాలలోని సారాంశం.

"ఎన్నో బాధలకోర్చి కష్టపడి చదివించాను. పెళ్లిచేసి ఉద్యోగం వేయించాను. రెక్కలు రానంతవరకె డొక్కలు నింపగలం కానీ, ఉద్యోగంచేస్తూ, భార్యతో కాపురం చేస్తున్నప్పుడుకూడా ఎంతకాలమని డబ్బు పంపించగలం? అయినా మనం ఏమంత భూమీ, పుట్రా వున్నవాళ్ళం? రెక్కలమీద బ్రతికేవాళ్ళం, 'అబ్బాయీ! దుబారా ఖర్చులు తగ్గించు. సినిమాలకు, డిన్నర్లకూ పెట్టే డబ్బు క్లుప్తంగా సంసారానికి సరిపెట్టుకో. సుఖంగా జీవయాత్ర సాగించగలుగుతావ్. ఇవి నీ మేలు కోరి చెప్పే మాటలు కాని నాకోసమేం కాదు. ఇవాళ వుండి రేపు పోయేవాళ్ళం మేం. గ్రహించుకో'-అంటూ జవాబు వ్రాశాను. ఇంక ఉత్తరాలు వ్రాయటం మానుకున్నాడు.

'కన్నకడుపు కొబట్టి కనికరం కలిగింది. కొడుకు పరాయిచోట బాధపడుతున్నాడంటె చూడకుండా వుండలేకపోయాను. పోనీ నాలుగు మందలించివద్దామని నాలుగు రాళ్ళు వేసుకుని బయలుదేరాను.

'నే యింటికి వెళ్లేటప్పటికి మీ అన్నయ్య యింకా ఆఫీసునుంచి రాలేదు.



"ఒరేయ్! గోపీ! దిగరా..."

మీ వదెన నన్ను బయట చూసి లోనకు వెళ్ళిపోయింది. తిరిగి బయటకు రాలేదు. ఎండనిపడి వచ్చాను. చివరకు దాహం తీసుకుంటారా అని కూడా అడగలేదు. అసలు నేవచ్చేనన్న సంగతే మర్చిపోయినట్లుంది. పోనీ నన్ను మావగారు, పూజ్యుడు, అనే భావం వదలి, యింటికి వచ్చిన అతిథిగా కూడా సత్కరించలేదు. చదువుకున్న పిల్ల, మంచిచెడ్డలు తెలుసుకుని మర్యాదతో మసలుకుంటుందని, ఏరి, కోరి, తెచ్చి వివాహం చేశాను. కానీ యింత అన్యాయంగా ప్రవర్తిస్తుందనుకోలేదు. అడిగిన వెంటనే డబ్బు పంపించలేదని, కోపం అనుకుంటాను! భర్త దుబారాఖర్చు పెడితే మందలించి ఖర్చు తగ్గించే బాధ్యత ఇల్లాలిపైనుంటుంది. కానీ భర్తతోపాటు ఆమె దుబారాగా ఖర్చు పెడుతూంటె సంసారాలాగుతాయా? మామగారు ఎంత కాలమని పంపుతుంటారు?

(53 వ పేజీ చూడండి)

# విజ్ఞాన వీధులు

"డాక్టర్"





## 134. నక్షత్రాల వర్తమానం తెలిసికోగలమా?

బహుళ విదియ తదియల తరువాత ఏనాడైనా చీకటిపడగానే ఆకాశంవైపు చూస్తే మిన్కుమిన్కు మంటూ నక్షత్రాలు తండోప తండాలుగా కనిపిస్తాయి. అప్పటికింకా చంద్రోదయం గాదు. చీకట్లు బాగా అలముకొని ఉంటాయి. అంధకార గర్భంలో నుండి చిన్న తారకలు సైతం తొంగిచూస్తాయి.

వెలుగుచుక్కలవలె కనిపించే నక్షత్రాల విషయం, కొంతవరకు, పాఠకులు ముందటి సంచికలలో తెలిసికొన్నారు. అవన్నీ మండుతున్న వాయుగోళాలు. బంతిక తెనున్న నక్షత్రం విడివి కొన్ని లక్షల మైళ్లుంటుంది. సూర్యుడొక విధమైన నక్షత్రమే. కాని, ఇతర నక్షత్రాలతో పోల్చినప్పుడు, సూర్యుడు మనకెంతో దగ్గరగా నుండుబట్టి, చుక్కవలె కాక, బింబంవలె సూర్యగోళం కనిపిస్తోంది. ఆర్ద్రా నక్షత్రమున్నంత దూరంగా మన సూర్యుడుంటే, చిన్న నక్షత్రంవలె మిన్కు మిన్కుమంటాడు. అప్పుడు భూమిలో జీవం లేకపోయేదేమో!

నక్షత్రాలన్నీ మనకు కోట్లకొలది మైళ్లు దూరంగా నుండుటచేత, నక్షత్రకాంతి మన భూలోకాన్ని చేరుకోడానికి కొంత కాలం తీసికొంటుంది. మన మోటార్లలాగ, విమానాల్లాగ కాంతికూడా ఆకాశంలో ప్రయాణంచేస్తుంది. కాని విమాన వేగానికీ కాంతివేగానికీ ఎంతో వ్యత్యాసముంది. గంటకు నాలుగైదు వందల మైళ్ళ వేగంతో విమానం పోతే, సెకండుకి 186000 మైళ్ల వేగంతో కాంతి గమిస్తుంది. అంతవేగంతో పరుగెత్తుతున్నప్పటికీ, కొన్ని నక్షత్రాల కాంతి వేలకొలది సంవత్సరాలు ప్రయాణంచేస్తే కాని భూమిని చేరుకోలేదు.

నక్షత్రలోకంలో దూరాలను 'కాంతి సంవత్సరం' అను యూనిట్‌తో కొలుస్తారు. సెకండుకి 186000 మైళ్ల చొప్పున ఒక సంవత్సరంలో కాంతి ప్రయాణించు దూరమది. దాని విలువ రమారమి 6 లక్షల కోట్లమైళ్లు; అంతదూరాన్ని ఒక కాంతి సంవత్సరమన్నారు. ఆ లెక్కని, మనకతి దగ్గరగా నున్న నక్షత్రదూరం 4¼ కాంతి సంవత్సరాలు; అతిదూరంగానున్న ఆండ్రోమెడ నెబ్యులా దూరం 8,00,000 కాంతి సంవత్సరాలు.

నక్షత్రాలెంతదూరంగానుంటే మనకేమి, అంటారేమో? ఏదైనా నక్షత్రం ఈక్షణాన్ని ఎలా ఉన్నదంటే తెలిసికొనే అవకాశం లేకపోతుంది. అంటే, ఇంతింత దూరాలవల్ల నక్షత్రాల వర్తమానం మనం తెలిసికోలేము.

విజయనగరంలో నున్న నేను చెన్నపట్నంలోనున్న నామిత్రుని శరీరస్థితి చూచి రమ్మని రామస్వామిని పంపించేను. బుధవారంనాడు మైలులో దిగి నేరుగా ఇంటికివచ్చి, రామస్వామి చెప్పేడు "ఆయన నింపాదిగా ఉన్నారు బాబయ్యా" అని. అయితే, ఆముందు రోజు సాయంకాలం, మైలు ఎక్కకముందు, నా మిత్రుని రామస్వామి చూచేడు. అతని భోగట్టా ఒకరోజు క్రిందటిది. కడచిన 24 గంటలలో మిత్రుని శరీర స్థితియందెట్టి మార్పు కలిగిందో చెప్పలేము. 500 మైళ్ళ దూరంలో నున్న మద్రాసు నుండి వచ్చినవార్త 24 గంటల క్రిందటిది. ఇప్పటి – ఈక్షణం – పరిస్థితి తెలిసికొనే అవకాశంలేదు; ఏమంటే, వార్తావహుడు ప్రయాణంచేసే కాలం కనీసం ఒకరోజు. ఎప్పుడు నేనా విధంగా వార్త తెప్పించుకొన్నా, అది 24 గంటల క్రిందటిదే అవుతుంది.

ఈ వ్యవధిని తగ్గించుకొనే మార్గాలున్నాయి. విమానం ద్వారా వార్తను తెప్పించుకొంటే 5 గంటల క్రిందటి పరిస్థితి తెలిసికోగలను. టెలిఫోనును ఉపయోగిస్తే ఏక్షణం పరిస్థితిని ఆక్షణాన్నే తెలిసికోగలను. కాని, ఈ సౌకర్యం నక్షత్రలోకాలలో లేదు. కాంతికంటె త్వరగా పరుగెత్తు వార్తావాహులు లేరు.

ఇప్పుడు జ్యేష్ఠానక్షత్రాన్ని చూచి 'ఎంత అందంగా మెరుస్తూంది' అనుకొన్నామంటే, ఆ తళుకు బెళుకులు ఈక్షణానివి కావు, 170 ఏండ్లక్రిందటివి. ఇప్పుడు మనకంట్లో పడిన కాంతి జ్యేష్ఠనక్షత్రం నుండి 170 ఏండ్ల పూర్వం బయలుదేరి, పదికోట్లమైళ్ళ శూన్యాకాశంలో ఎడతెరిపిలేకుండా 170 ఏండ్లు ఆ మహావేగంతో పరుగెత్తింది. అందుచేత, ఇప్పుడు మనం చూస్తూన్న జ్యేష్ఠానక్షత్ర రూపం 170 ఏండ్లక్రిందటిది; అంటే 1788 వ సంవత్సరంలో జ్యేష్ఠానక్షత్రం ఇప్పుడు కనిపిస్తూన్నట్లుండేది. ఈలోపున దానికే ప్రమాదం జరిగియున్నప్పటికీ మనకు తెలియదు. కొన్ని నక్షత్రాలకు మండిపోయి విచ్చిన్నమయే గుణముంది. ఆవిధంగా జ్యేష్ఠకూడ ఏనాడైనా మండి విచ్చిన్నమైపోతే, నాటికి 170 ఏండ్ల తరువాతే కాని మనకా విషయం తెలియదు; 170 ఏండ్లవరకు జ్యేష్ఠ యథాస్థానంలో మనకు కనిపిస్తూనే ఉంటుంది.

ఏనక్షత్రమైనా ఇదేవరుస. ఇప్పుడు ధ్రువనక్షత్రంయొక్క ఫోటో తీసేము. కాని, మన ఫోటోలో పడినది క్రీ. శ. 868 లో నున్న ధ్రువునిరూపం. అయితే, ఇప్పుడు ధ్రువుడెట్లున్నాడు? ఏమో; ఆ విషయం క్రీ. శ. 3038 లో కాని మనకు తెలియదు, తెలిసే అవకాశం లేదు. ధ్రువుని కాంతి 1085 సంవత్సరాలు అవిచ్ఛిన్నంగా ప్రయాణంచేస్తేకాని భూమిని చేరుకోదు.

ఇంకొక విశేషమేమంటే, ఈ కాల వ్యవధి నక్షత్రానికి నక్షత్రానికి మారుతుంది. ఏనక్షత్రం ఎన్ని కాంతి సంవత్సరాలదూరంలో నుంటే, అన్ని సంవత్సరాలక్రిందటి దానిరూపం మనకిప్పుడు కనిపిస్తుంది. 8 ఏండ్లక్రిందనున్నట్లుగా సిరియను, 28 ఏండ్లక్రిందటి వేగా, 16 ఏండ్ల క్రిందటి శ్రవణం, 54 ఏండ్ల క్రిందటి రోహిణి, 800 సంవత్సరాల క్రిందటి ఆర్ద్రా,

70 ఏండ్లక్రిందటి మఖా, 31 ఏండ్లక్రిందటి పునర్వసు, 190 సంవత్సరాల క్రిందటి చిత్రానక్షత్రాలు మన కీక్షణాన్ని కనిపిస్తాయి. వాటి వర్తమానరూపం ఎట్లుందో తెలిసికోలేము. ఆ అశక్తతను ప్రకృతి మనపై ఆరోపించింది.

నక్షత్రలోకంలో వివిధ నక్షత్రాల వేర్వేరు భూతకాలాలను ఒకేసారి చూస్తున్నాము. నక్షత్రదూరం ఎక్కువైనకొద్దీ, మన కగుపించేదాని గతం ఎక్కువౌతుంది. తల పైకెత్తి నక్షత్రాలను చూచినప్పుడల్లా మనదృష్టిని గతంలోకి పంపిస్తున్నాము. ఆ విషమపరిస్థితినుండి తప్పించుకొందామన్నా వీలులేదు. నక్షత్రవిషయంలో మనదృష్టి సర్వదా భూతకాలబద్ధమై యుండవలసిందే! "వసంత"

## చిట్టిప్రశ్నలకు జవాబులు

—కారముతింటే చెవులలోపల హోరుమంట ఎందుకు పెడుతుందంటారా? ఒక్క చెవిలోనేనా, స్వామీ,—నాలికా, పెదవులూ, అంగుడూ, గొంతూ. గొంతుగొట్టామూ కడుపూకూడా మండెడతాయి. గొంతునుంచి, ముక్కుకీ. చెవికీ దార్లున్నాయి. చెవిమీదకారానికల ప్రభావమే 'హోరు' గొంతులోకి వెళ్లి కారము చెవికికూడా అందిందన్నమాట!

—భూమిమీదపడేవి నిండు నక్షత్రాలు కావు. నక్షత్రాల రజము అనవచ్చు. పెద్ద పెద్ద బండరాళ్లంతలేసి ఉల్కలు పడడమూ కద్దు. భూమి పరిమాణంతో పోల్చితే అవి ఎంతపాటి?

—నవ్వినప్పుడల్లా ఎక్కిళ్లు రావు. అల్లమూ, మిరియమువంటి కారపువస్తువుల ద్రవాలుకడుపులోకివెళ్లితే వస్తాయిఎక్కిళ్లు. సామాన్యంగా భోజనముచేస్తూన్నప్పుడు మాత్రమే ఎక్కిళ్లురావడము మీరు గుర్తించలేదా?

—తుమ్ము అన్నది, మన కంఠంలోకి తెరచిఉండే గాలిగొట్టాంలోకి ఏదేనా ద్రవ, ఘనపదార్థము ప్రవేశిస్తే, దాన్ని బయటికి పంపేయడానికని ఊపిరితిత్తులలోని గాలి బస్సుమని పైకి వచ్చేక్రియ. సూర్యుడివేపు చూచినప్పుడు కొందరి ముక్కులోని గ్రంథులు స్రవించి, ఆ స్రావద్రవము గాలిగొట్టంలోకి చేర యత్నిస్తుంది. అప్పుడు తుమ్ముతారు. ముక్కులో ఏదేనా తిరిపెట్టినా, ఈ తిరిపెట్టే వస్తువుని బయటికి చిమ్మేయడానికి తుమ్మువస్తుంది. పొంప పట్టినప్పుడు పలచని చీమిడి గాలిగొట్టములోకి దూరయత్నిస్తుంది. అందుకే వస్తుంది తుమ్ము.

—ఉల్కలు భూమిసైజుతో పోల్చితే చాలా చిన్నవి. కనక ఉల్కాపాతమువల్ల పెద్ద నష్టము జరగదు. ఎన్నో ఉల్కలు గాలి రాపిడికి వేడెక్కి జ్వలించి, భూమిని చేరేసరికి పొడిపొడి అయిపోతాయి. దక్షిణ అమెరికాలోని అరిజోనా ఎడారికి ఈశాన్యమూలలో కొన్నివేల సంవత్సరాల క్రితము బ్రహ్మాండమైన ఉల్కపడి, పేద్ద బిలము చేసినదట. ఈ బిలము నానాటికి పూడిపోయినా, ఈనాటికి 1350 గజాల వ్యాసముతో, 200 గజాల లోతుగా ఉంది. ఈ బిలము అడుగున బోరింగులు పెట్టి కొన్ని వందల అడుగుల వరకూ తవ్వితే, ఆ ఉల్క దెబ్బకి పిండి పిండి అయిపోయిన శిలల పొడుము మట్టుకే కనిపించింది.

—ఉల్కలు అన్నీ ఒకే నిర్మాణము కలవి కావు. కొన్ని భూమి పై పొరలలోని శిలలవలెనూ, మరికొన్ని ఇనుపముద్దలనూ పోలి, 'ఏదే నొక గ్రహము ముక్కలు ముక్కలుగా అయిపోయిన తునకలే కాబోలివి' అనిపిస్తున్నాయి. ఈ అనుమానానికి దన్నుగా, అంగారక గ్రహానికీ, గురుడికీ మధ్యన పేద్ద ఖాళీ ఉంది.








# బండ సూరి

★

శ్రీ కాశీరాజు వీరరాఘవ రావు.

చూచావా బాలా! మా
సూరి బాబు నెఱుక్షైనా

సూరీ, సూరీ, నీవు
చుం చెలుకవు అనగానే
బుంగమూతితో కోపం
బుస బుస వచ్చేస్తుంది.

నల్ల బొంత కాకిదన్నా,
కల్లుముంత వని అన్నా
గొల్లుమంటు యిల్లంతా
గోలచేసి వేస్తాడు

బుర్రాడిస్తూ చక్కగ
బుర్రకథను చెప్పేవాడు!
పాటల నెన్నో పాడి
ఖుష్షనిపించే వాడు.

ఓ, న, మః రాదుగాని
ఒకటో క్లాస్ బుక్కంతా
గుర్తుపట్టి గణగణా
పూర్తిగ చదివేవాడు.

ఇవ్వాదన్నా మరచిపోడు
ఎవ్వడు చిరుతిండికోరకు
అరచి చేస్తూయున్నా
ఆట, పాట, చదువు మానడు.

చేతిలోని బెల్లము అవ
తలకు ముందే మతిపోయిక
బెల్లము నంపాదించగ
వేస్తాడెన్నో ఎత్తులు.

గుట్టుగ చప్పుడు చేయక
పెట్టె తెరచినవు తమ్ముడు
మెల్లగ టోపీ వేసి
బిల్లీ కాని చూస్తాడు.

నల్లపూస యంత కూడ
గిల్లి పెట్ట డెవ్వరికిని
బుల్లి చెల్లెలికి మాత్రం
బుజ్జగించి పెడతాడు

★

విన్నావా బాలా! మరి
చిన్ని బండ సూరిని నీ
నేస్తంగా గ్రహియించి
నేర్చుకోయి బుద్ధులను.



అద్దె బోటులో—

# ముచ్చటగా ముగ్గురు

## (కుక్క సంగతి సరే సరి!)



### 6

వెల్లిగా మోల్సీలాకులికి చేరింది మా బోటు. పెద్ద లాకులే. కాని మాదొక్కటీ తప్ప మరో బోటే లేదు. ఇక్కడ ఇంత బొత్తిగా సందడి లేకపోవడం కొత్తే. ఇదివరలో ఇక్కడంతా కిటకిటలాడిపోతూ వుండేది. పైనుంచి చూస్తే లాకుల్లో బోట్లే కాని నీళ్ళు కనపడేవి కావు. రకరకాల టోపీలు, రంగురంగుల దుస్తులు గొడుగుల్తో మగా ఆడా జనం కిక్కిరిసిఉండేవాళ్లు. ఆదివారంనాడు చూడాలి ఈ జాగా. లాకులికి బయట కాలవపొడుగునా బోట్లు బారులుతీర్చి ఉండేవి. కొందరు మరో వ్యావృత్తి లేనట్లు పైపులూ చుట్టలూ కాల్చుకుంటూ గుప్పుగుప్పున పొగ వదుల్తూ జేబుల్లో చేతులు పెట్టుకొని బోట్లవంక చూస్తూ నుంచుంటారు. కొందరు అటూ ఇటూ తెగతిరుగుతారు. కుక్కలకి మాత్రం ఇక్కడ పని తీరిక లేనట్లు కాలు నిలువకుండా తిరుగుతాయి.

దుస్తుల టీపీ, సొగసూ రాణించాలంటే నదీతీరంలోనేనని చెప్పాలి. వాళ్ల వాళ్ల అభిరుచులు ఇక్కడే తెలుస్తాయి. చేతిలో ఉన్నా, మెడకి ఉన్నా రుమాళ్ళ రంగులన్నీ ఇక్కడే కనపడతాయి. హారిస్‌కీ జార్జికీ అసలు దుస్తు లెలావుండాలో బొత్తిగా తెలియదు. జార్జి ఒక బ్లేజర్ కోటు కొనుక్కొచ్చాడు. అది చూస్తే నాకు వికారం పుట్టుకొచ్చింది. "ఇది ఏం రంగంటావురా?" అన్నాను. వాడికి రంగుపేరేం తెలీదుట. కాని పర్షియాలో తయారుచేసిందని వాడికి చెప్పారుట. ఇది చూస్తే పక్షులు మైలుదూరంలో ఉండకుండా పారిపోతాయన్నాడు జార్జి. అందరి కళ్లూ మామీదే ఉంటాయని నా భయం.

ఇలాంటి బోటుషికారుకి అసలు ఆడవాళ్లు కూడా ఉంటేనే అందం, చందం. బోటుషికారుకి ప్రత్యేకం గౌన్లుంటాయి. బోటుషికారు గౌన్ల పేరు చెప్తే ఇదివరకు షికారొకటి జ్ఞాపకం వస్తుంది నాకు. దుస్తులైతే చూడ్డానికి బాగానే వుంటాయి కాని, దుస్తుల మీదే ప్రాణాలు పెట్టుక్కూచుంటే మాత్రం షికారు యమయాతనై పోతుంది.

అప్పుడిద్దరమ్మాయిలొచ్చారు మాతో షికారుకి. వాళ్లవి సిల్కుగౌనులు. వాటినిండా లేసులు. పరపరలాడుతున్నాయి. అతినాజూకైన కాలిజోళ్లు, మడత కనపడని రిబ్బన్లు, పువ్వులూ—గట్టిగా గాలి వీస్తే గౌను నలుగుతుందో పువ్వులే వాడిపోతాయో అన్నట్లుంది. అసలిటువంటి దుస్తుల్తో వీళ్లని బోటెవడెక్కమన్నాడు?

ముందు బోటంతా దుమ్మూ మట్టే అన్నారు. మేం తుడిచేశాం అంటే నమ్మరు. ఒకావిడ బెరుగ్గా వేలితో సీటుమీద రాసిచూసింది. ఇద్దరూ ముఖ

మూలం : జెరోమ్ కె. జెరోమ్



అనువాదం : విశ్వాత్ముల నరసింహమూర్తి



# ముచ్చటగా ముగ్గురు



ముఖాలు చూసుకున్నారు. ఇంక తప్పదురా అనుకుని ఎల్లాగో కూచున్నారు—మరణశిక్ష విధిస్తే ముళ్ళ చక్రంమీద కూచున్న క్రీస్తుభక్తుల్లాగా. తెడ్డు పడితే నీరు చినికి బట్టలు ధ్వంసం అయిపోతాయని బెదిరిపోతూ చూస్తున్నారు. నీటిచుక్క పడితే మచ్చ పడిపోయి ఇంక అది చచ్చినా పోదుట.

నేనే తెడ్లు పుచ్చుకున్నాను. తెడ్డు వేసినప్పుడు, తరవాత యెత్తినప్పుడు నీళ్లు చిందకుండా మెల్లిగా పట్టుకుని మరీ నడుపుతున్నాను. అయినా ఎప్పుడేనా ఒకసారి ఓ చిన్ని నీటిచుక్క పడక మానలేదు.

పాపం అమ్మాయిలిద్దరూ కిక్కురు మనలేదు. కాని ఒక్కళ్ల కొకళ్లు ఒదిగొదిగి దగ్గరగా కూచున్నారు. నీటిచుక్క ఎగిరితే చాలు ఉలిక్కిపడి వొణికిపోతున్నారు—అందులోంచి ఏ భూతమో వస్తుందన్నట్టు. వాళ్లిద్దరూ ఆవిధంగా మౌనంగా ఇంత బాధ పడ్డం చూసేసరికి జాలివేసింది—భయమూ పుట్టింది. చేతులు వొణకడం మొదలెట్టాయి. చివరికి వొదిలేశాను. నా మిత్రుడు తెడ్లు పుచ్చుకున్నాడు. అమ్మాయిలు 'అమ్మయ్య' అనుకున్నారు ఒక్కసారి. మొహాలు తేటపడ్డాయి. కాని పాపం! మరుక్షణంలో ఒక్క ఉదుటుని లేచి నిలబడ్డారు. మావాడు మొదలెట్టడమే జోరుగా వేశాడు తెడ్లు. అమ్మాయిలు నీళ్లల్లో స్నానం చేసినంత పనయింది. 'అయ్యో!' అని మూలిగారు దుస్తులకేసి చూసుకుని. కాని మావాడికి చీమ కుట్టినట్టైనా లేదు. "అరెరే! నీళ్లు పడ్డాయా మీద?" అన్నాడు తాపీగా.

"పోనీ లెండి" అన్నారు అమ్మాయిలు ఇంక చేసేదేంలేక—గొన్నుకి నీళ్లు వొదులుకున్నట్టు.

మళ్ళీ ఆలోచనల్లో పడ్డ నన్ను వీపు తట్టాడు హారిస్. గట్టువంక చూశాను. హాంప్టన్ చర్చి వచ్చింది. ఇక్కడ దిగి శ్మశానానికి వెడతానంటాడు హారిస్. "మిసెస్ థామస్ సమాధి చూసివస్తాను" అన్నాడు.

"మిసెస్ థామస్ ఎవ్రరా?"

"నాకేం తెలుసు? అదేమిటో ఆవిడ సమాధి విచిత్రంగా ఉంటుందిట! అది చూద్దామని."

అదేం కుదరదన్నాను. ఆవిడ తన బంధువా కాదు, ఏమీ కాదు. పనిగట్టుకుని ఇప్పుడెందుకెళ్ళాలో. ఏ వూరేనా వెడితే మొట్టమొదట శ్మశానాల్లో మనకు తెలిసినవాళ్ళ సమాధులు దర్శించాలనేది మంచిమాటే. కాని నాకుమాత్రం అది గిట్టదు. కొందరు అతిభక్తితో చూసి చదివే సమాధి వృత్తాంతాలంటే నాకు తలనొప్పి. నా అశ్రద్ధ, దుర్వినయం చూసి పెద్దవాళ్లు కోపగించుకుంటారు.

ఒకరోజు పొద్దున్నే ఎండ చక్కగా వుందని ఒక చర్చిగోడ కానుకుని నిలబడ్డాను. ఆ ప్రశాంత వాతావరణంలో పైప్ కాల్చుకుంటూ ఆలోచిస్తున్నాను. ఆ చుట్టుపక్కల లేతఎండా గుట్టలూ చెట్లూ చూస్తూంటే వెచ్చవెచ్చని భావాలు కదలడం మొదలెట్టాయి. నన్నేడిపించిన మిత్రుల్ని, శత్రువుల్ని, బంధువుల్నీ అందర్నీ క్షమించేశాను ఆ క్షణంలో. నాలోని పాపాలన్నీ కడిగేసుకున్నా ననిపించింది. ఇక్కడే నివాసం స్థిరపరుచుకుని ఎన్నడూ ఏ పాపం చెయ్యకుండా పవిత్రమైన జీవనం నాగించాలని అనుకుంటున్నాను. ఇంతలో దూరంనించి సన్నని గొంతుక వినవచ్చింది.

"వచ్చేస్తున్నానండి. ఆలస్యం అయింది. చూశేదండి. చూస్తే వొచ్చేసేవాణ్నండి" అంటూ ఒక బట్టతలమనిషి గునగున నడుచుకుంటూ తాళం చెవులూగించుకుంటూ వస్తున్నాడు.

మౌనంగానే చేత్తో అక్కర్లేదు వెళ్లిపొమ్మన్నట్లు సంజ్ఞ చేశాను.

"కొంచెం కాలు కుంటిలెండి. రండి రండి" అంటున్నాడు.

"అబ్బ! నువ్వెళ్లిపో. నన్నిల్లా ఉండనిస్తావా, గోడదూకి పారిపొమ్మన్నావా?" అన్నాను.

మనిషి తెల్లబోయి నిలబడిపోయాడు. "సమాధులు చూడరూ?" అన్నాడు.

"అక్కర్లేదు. సమాధులు చూడ్డానికి రాలేదిక్కడికి. ఇక్కడ కాస్సేపు హాయిగా గడుపుదామని వచ్చాను. నువ్వేమిటి మధ్య; నువ్వూ నీ సమాధులూ

ఎవడి క్కావాలి. నీ క్కావలిస్తే కాసున్నర సమాధి కట్టించుకో, సహం ఖర్చు నే పెట్టుకుంటాను."

అతను విస్తుపోయాడు. కళ్ళు నులుపుకుని మళ్ళీ నాకేసి తేరిపారచూశాడు. చూస్తే మనిషిలాగే కన పడ్డాను కాబోలు, మెల్లిగా అన్నాడు. "మీా రిక్క డికి కొత్తగా వచ్చారా? ఈ ఊరు కాదా మీాది?"

"కాదు."

"అయితే ఇక్కడ సమాధులు చూస్తారా?"

"ఛస్తే చూడను ఎందుకు చూడాలి? చూడా లంటే మా వూళ్ళో మా వాళ్లవే బోలెడున్నాయి. మా మామది ఉంది. మా తాత సమాధి ఉంది..."

చూడవలసిన సమాధులున్నాయి రమ్మని బతి మాలడం మొదలెట్టాడు. రానుగాక రానన్నాను. దగ్గరకొచ్చి రహస్యంగా "పోనీ రెండుపుర్రెలున్నాయి చూస్తారా..."

ఇహ మరి నే నక్కడుండలేదు. అదే పరుగు చ్చుకున్నాను. సమాధులంటే నాకంత తిక్క.

హారిస్‌కి మాత్రం సమాధులు చూడ్డం అంటే పిచ్చి సరదా. స్మృతి వాక్యాలు శ్రద్ధగా భక్తితో చదు వుతాడు. మిసెస్‌థామస్ సమాధి చూడకుండా ఉండలేనంటాడు. అసలు అది చూడ్డంకోసమే షికా రుకి బయలుదేరా నంటాడు.

జార్జి మాట జ్ఞాపకం చేశాడు హారిస్‌కి. వాడు షిపర్టన్‌లో సాయంకాలం అయిదింటికి బోటుని కలు సుకుంటాడు. అంతవరకూ రోజంతా ఏం చేస్తాడో ఊళ్లో! ఈ బోటంతా వొదిలేసి నిక్షేపరాయుల్లా చేతులాడించుకుంటూ తిరుగుతున్నాడు. వీడూనూ, వీడి బాంకూనూ. బాంకుకి వీడు ఒరగబోసే దేమిటో!

"వాడక్కడే పని చెయ్యగా నే చూళ్లేదు" అన్నాడు హారిస్. "నే నెప్పుడు చూసినా ఆ కళ్ళ జోడు పెట్టుకుని మహా ఏదో పనిచేస్తున్నట్టు నటిస్తూ వుంటాడు. ఎందుకో ఊరికే అల్లా కూచోడం వాడు? నాకుమల్లే ఒళ్లు వొంచి పనిచేస్తేయేమో! వాడూ వాడి బాంకులూనూ. ఈ బాంకుల్లో మన డబ్బు ఇచ్చినప్పుడు ఇట్టే అందిపుచ్చుకుంటారు. మళ్లీ మన డబ్బు మనం తీసుకోడానికి చెక్కు ఇస్తే 'డ్రాయర్ చూడు' అనో 'సరుకు లేదు' అనో కాగితం అంతా ఖరాబు చేసి వొదిలిపెడతారు. నాకల్లాగ పోయిన వారం రెండుసార్లు చేశారు. ఇంక నేను వీళ్లని ఊరుకు నేది లేదు. నా ఎక్కౌంట్ మూసేస్తాను. అసలు వా డిప్పుడు బాంకుకి వెళ్ళుండడు. ఎక్కడో త్రిపాదిలా తిరుగుతూ వుంటాడు——పనంతా మనమీాద వొదిలేసి. నేను కూడా ఒకసారి అలా వెళ్లివస్తాను. ఒక గుక్కెడు పుచ్చుకొస్తాను" అంటూ బయలుదేరాడు.

అసలు చుక్క పుచ్చుకోవాలంటే చాలాదూరం పోవాలని వాడికి చెప్పాను. అది మానేసి నదివొడ్డంట పచార్లు చెయ్యడం మొదలెట్టాడు. వాడి కాక్షణంలో ఇంత నదీ వొట్టి దండగనిపించింది——తన దాహం తీర్చ లేదుట!

హారిస్‌కి తిక్క వచ్చినప్పుడు వాణ్ని వాడి మానాన వొదిలెయ్యడం మంచిది. తల్చుకుని తల్చు కుని అంతా దులుపుకుని, తేలికపడి వొస్తాడు. అప్పుడు మళ్లీ వాడు మాట్లాడతగిన మనిషి.

తిరిగొచ్చినతరవాత బోటులో లెమనేడ్ ఉంది తీసుకోమన్నాను. "దీనికి దాహం తీరితే ఇంకేం. చచ్చు నీళ్లు" అన్నాడు. అయినా మాన లేదు. 'ఏదో ఒకటిలే' అని నసుక్కుంటూ కూచు న్నాడు. వొంగి భోషాణంలో సీసా అందుకోబో యాడు. అందలేదు. మరికొంచెం ముందుకి వొంగాడు. బోటు తైతక్కలాడింది. దాంతో భోషాణంలోకి బోర్ల బడ్డాడు. కాళ్లు పైకి తేలేశాడు. మళ్ళీ పడిపోతాడని భయపడి కదలకుండా అలా తలమీాదనే నిలబడిపో యాడు. నేను మెల్లిగా వాడి కాళ్లు అందుకుని లాగాను. తిన్నగా కూచున్నాడు. కోపం వాడి ముక్కుమీాద తాండవిస్తోంది.

(ఇంకావుంది)

# తేలుకుట్టిన దొంగ

నాన్నగారి దగ్గిర డబ్బుంటే ఆయన అడక్కుండా సేయిస్తారు. అంత యెక్కువగా మనం పట్టుపట్టడమే అనవసరం. అది యిప్పటికీ నామనస్సులో బాగా నాటుకుంది.

"పరీక్ష ప్యాసైనప్పుడల్లా నీకో రూపాయిస్తానురా" అన్నారు మా నాన్నారు. ఆప్రకారమే ప్రతియేడు యిచ్చుకొచ్చేరు. ఈయేడు కూడా ప్యాసయ్యాను. నాకు ముట్టవలసింది ముట్టలేదు. మానాన్నగారిని అడిగినప్పుడల్లా విసుగ్గా "యిప్పుడు యిబ్బందిగా వుందిరా! కాసేపు గుత్తాన్ని కట్టెయ్యరా ఇస్తాను" అంటూ గడుపుకొస్తున్నారు. పరీక్ష వ్రాశాను. అప్పటికీ, ఇప్పటికి రెండు నెలలు గడిచాయి. కాని ఒక్క సినీమాయేనా చూళ్ళేదు. పరీక్ష ప్యాసైనమూలాన నాకు వుత్సాహం ఆగటంలేదు. "థర్డు ఫారం పబ్లిక్ పరీక్ష ప్యాసయావ్ మమ్మల్ని సినీమాకి తీసి కెళ్ళాలోయ్" అంటున్నారు ఫేలైన వాళ్లు. కరువులో అధికమాసం అన్నట్టు, నాకొక్కడికే సినీమాకి డబ్బు ల్లేవనుకుంటూంటే నాకు తోడు వీళ్ళు కూడానా?

రెండు రోజులు దాటేయ్. నా చేతికి డబ్బందలేదు. ఒక వుపాయం తట్టింది. నే నెప్పుడూ దొంగతనం చెయ్యకపోయినా, మా నాన్న రెప్పుడూ నన్ను 'దొంగవెధవా' అని తిడతారు. ఆ తిట్టేది ఎలాగా తప్పటంలేదు. పోనీ ఆపేరు సార్థకం చేసి కొందామనుకున్నా నే నారోజున. నాస్నేహితులగోలా వదిలి పోతుందనుకొన్నాను.

అమ్మ అన్నంపెట్టి అందర్ని భోజనానికి పిలిచింది. చెల్లి, నాన్నగారు వెళ్ళేరు. నాకిప్పడప్పుడే ఆకలేదని చెప్పి, యేదో చదువుతున్న వాడికిమల్లే నటించా. ఏదో కొంచంసేపు నసిగి మెల్లిగా పడకటింటిలోని చిలక్కొయ్య దగ్గిరికి



శ్రీ కూరపాటి వెంకటరంగారావు



అడుగులో అడుగు వేసుకుంటూ వెళ్ళేను. నాన్నగారి చొక్కా జేబులోకి చెయ్యి పోనిచ్చేను. చిల్లరేం తగల్లేదు. మానాన్నారు చిల్లరయితే జేబులోనే పోస్తారు; నోట్లయితే పర్సులోకి ఎక్కిస్తారు. జేబులోంచి పర్సు బయటికి తీశా. పర్సు తెరిచి చూస్తే చిన్ననోట్లేం లేవు. ఒక్క అయిదురూపాయిలు నోటుమాత్రం క్రిందిఅరలో వుంది. రసీదులు, యింకా యేవో కాగితాలు వున్నాయ్ వాటిమధ్యని వుంది ఆనోటు. నెమ్మదిగా అది తీసి నాబనీను జేబులోకి తోసి, పర్సు మళ్ళీ నాన్నారి జేబులో పెట్టేశా. ఇంతట్లోకి మానాన్నారు అన్నం తినేసి "ఎవ్" అని త్రేన్చుకుంటూ, నే నున్న గదిలోకి వచ్చేరు. చచ్చేన్రా దేవుడా అనుకున్నాను. గభుక్కున పెద్ద మంచంక్రింద దూరేను. మానాన్నారు, ఈ గదిలోనే బల్లమీద దస్త్రం విప్పి ఏవో కాగితాలు వెతుక్కుని, మళ్ళీ దస్త్రం కట్టేసి చొక్కా వేసుకొని ఆకాగితాలు చంకలో పెట్టుకుని సావిట్లోకి వెళ్తూ "నేను కాకినాడ వెళ్తున్నాను, రేపు ప్రొద్దుటికి వచ్చేస్తా యింటిదగ్గిర జాగ్రత్తగా వుండండి" అనిచెప్పి జోళ్ళు ధరిస్తున్నారు.

నాన్నారు వెళ్లిన తరువాత అన్నంతినేసి మనం కూడా బయటికి ఉడాయించొచ్చు అనుకొన్నాను. సినీమాకు పోయివచ్చి తరువాత ఎలాగో అలాగ నచ్చచెప్పవచ్చు అనుకున్నాను.

నాన్నారు బయటికి వెళ్ళినట్టేవెళ్లి మళ్ళీ లోపలికి వచ్చి "ఏమేవ్ పర్సులోంచికాని అయిదు రూపాయిల నోటు తీశావా?" అంటూ కంచాలు కడుక్కుంటున్న మాఅమ్మ దగ్గిరికి పరుగెత్తారు.

ఇదేరా సమయం అనుకొని నెమ్మదిగా డేక్కుంటూ వస్తున్నాను, మంచం క్రిందనుంచి. మంచంక్రింద చీకటిగా ఉన్న మూలాన చేతుల్తో దారి తడుముకుంటూ వస్తున్నా. చేతికేదో కుట్టినట్టయింది. ఇంకా ముందుకు జరిగేను. బాధ మరికాస్త యెక్కువైంది. గభుక్కున లేవబోయా. మంచంపట్టె ఠపీమని తగిలింది తలకి.



దిమ్మతిరిగిపోయింది. కళ్ళు చీకట్లు కమ్మాయి. మళ్ళీ వెనక్కి తగ్గేను. కుట్టినబాధ కుట్టినచోట లేదు. చంక క్రిందికి ఎక్కిపోయింది. "తేలురా బాబూ" అనుకున్నాను. బాధ మరీ ఎక్కువైపోతోంది. ఏడుపు, మంటలు, ఉక్రోషం అన్నీ ఒక్కసారే కూడుకొచ్చాయి. ఏం చెయ్యాలో తోచలేదు. మంటలు, మంటలు. కుట్టినచోటు చూస్తూ కళ్ళమ్మట నీరు తెగ కార్చేస్తున్నా. లోలోపలే గట్టిగా ఏడిచేస్తున్నాను. అక్కడే కూలబడ్డాను. చంకనుంచి గుండెల్లోకి ఎక్కుతుందేమో నని చంక దగ్గర నొక్కిపెట్టాను గట్టిగా. అక్కడే చూస్తూ తేలుకుట్టిన మాటమీద దృష్టివుంటే బాధ మరీ యెక్కువవుతుందని, మానాన్న గొడవ పడుతోంటే వింటున్నా.

"ఏమోనండి ఎవడిక్కావాలి అయిదు, గియిదు. వెతుక్కోండి జేబునరిగా లోపలే వుంటుంది" అంటోంది కంచాలు కడుక్కుంటూ మాఅమ్మ.

"నీ మొహం యింకేం వెతకను అంతా వెతికేను. ఎక్కడా కనపడ లేదు. ఒకవేళ మున వెధవ గాని తీసేడేమో. ఒరేయ్ రంగా" అంటూ నన్ను పిలుస్తూ గదిలోకి వెళ్ళేరు "ఇక్కడ్లేడు, వెధవ వాడే తీసుంటాడు. దొంగతనాలు కూడా మొదలెట్టేడా దొంగవెధవ" అంటూ గొంతు చించుకుంటున్నారు.

"అదేం మాటండీ! దొంగతనం మాట యెంతా వంటా లేదు వాడు అలా చేసేవాడు కాదు. మీరే ఎక్కడో పారేసి వాడిమీదకి తోసేస్తున్నారేమో వుండండి. మాసిపోయిన బట్టలమూటలో మీచొక్కా జేబులో వుందేమో చూస్తాను" అంది అమ్మ.

నా బాధ యెక్కువైపోయింది. మంటలు మరీయెక్కువైపోయాయి. బాధ తగ్గితే ఆంజనేయస్వామికి కొబ్బరికాయ కొడ్తాను అని యింకా చాలా మొక్కులు మొక్కాను. బాధ తగ్గలేదు. ఏడుపుకళ్ళతో ఒకసారి క్రిందకి చూసేను. ఒక పెద్ద తేలు నావైపు వస్తోంది. ఇదేరా బాబూ కుట్టింది, మళ్ళీ కుట్టడానికొస్తోంది అనుకొని, దాన్ని చంపడానికి సాధనం దొరకని మూలాన, పక్కనేవున్న పెద్ద బట్టలమూట

(43-వ పేజీ చూడండి)

# రహస్యం

ఒకవూరు. ఆవూరి కెదురుగా ఒక పెదసరస్సు. ఆసరస్సు కానుకొని ఎత్తైన కొండలు. అది వసంతకాల మగుటచే, ఆకొండల మీదనున్న చెట్లు చిగిర్చి వుండటం సరస్సు తామరాకులతోను, కలువ పువ్వులతోనునిండి,సరస్సులోనున్న చిన్ని, చిన్ని, చేపల్ని వేటాడ టానికి తెల్లటి కొంగలు కూర్చు నుండటం చూస్తే ప్రకృతిదేవత అవతరించిందా! అన్నట్లుంది.

ఆవూర్లో 'రహీం' అను నతడు చిన్న వ్యాపారం చేసుకుంటూ, తనకున్న నాలుగెకరాల భూమి సాగు చేసుకుంటూ వయస్సు కు చిన్నవాడైనప్పటికి గౌరవంగా బ్రతుకుతున్నాడు. అతని తల్లి దండ్రులు తన పెండ్లి కాకముందే, పరలోకగతులయ్యారు. 'రహీం' పెండ్లి చేసుకొని సుఖంగా జీవన యాత్ర నలుపుతున్నాడు. 'రహీం' దైవభక్తి కలవాడు, తనూ తనవ్యాప వారమేగాని ఇతరులజోలికి వెళ్ళటం ఎరగడు. అతని భార్యకు కూడ దైవభక్తిమెండు. 'రహీం' భార్య చాలా అందంగా వుండేది. దానికి తోడు భర్తసుఖాని కెప్పుడు లోటు రాకుండా, మెలుగుతూండేది. అందువల్ల భార్యంటే 'రహీం' కెక్కువప్రేమ, అనురాగం. తన యింటి కెదురుగావున్న పచ్చిక మైదానంలో కోడి తన చిన్న పిల్లలను మేపుతుండటం, గ్రద్దగాని, పిల్లి గాని, కనబడినప్పుడెల్ల 'కొక్' అనగానే చిన్నకోడిపిల్లలు దాక్కోటం, తన శత్రువు పోయినవెంటనే 'కొ-క్కొ-' అని తన పిల్లల్ని, పిలిచి మళ్ళీ మేపటం - చూచి 'రహీం' దేవుని మహిమను, ప్రకృతినిగూర్చి ఆలోచిస్తుండేవాడు. 'రహీం'

యం. జీవహాప్రు[illegible]

యింటి కానుకొనివున్న ఇంట్లో ఒకపోలీసు కానిస్టెబుల్ కాపుర ముండేవాడు. అతడుకూడ ఒకరి జోలికి రాక బాగా మసులుకొనే వాడే.

ఒకరోజు ఆవూరి సమీపంలో నున్న రావిచెట్టుక్రింద అందరూ కూర్చుని 'పిచ్చాపాటి' మాట్లాడుతూ అందులో నొకడు, తలూపుతూ "మగవాడు ఏరహస్యంమైనా స్త్రీతో చెప్పకూడదు. ఆడదానినోట్లో నువ్వుగింజ నానదు" అన్నాడు. 'రహీం' ఆమాట సహించలేకపోయాడు, తనకు తన భార్యమీదనున్న ప్రేమవల్ల. "ఓరే 'రహీం' నీకంత కోప మెందుకోయ్, కావలిస్తే అలా చేసి చూడు" అన్నాడు పైగా ఆపెద్ద మనిషి. దాంతో 'రహీం' తెలుసుకో తలపెట్టాడు, యీవిషయం, నిజమా కాదా అని. అలాగే కొన్నిరోజులు గడిచాయి.

ఒకరోజు అకస్మాత్తుగా యీ విషయం జ్ఞాపకమొచ్చింది. వెంటనే 'రహీం' బజారుకెళ్ళి తన తెల్లటి సంచిలో ఒక వస్తువు చుట్టుకొని వస్తున్నాడు. ఇంటిలో కాలుమోపి, లేనిపోని, కంగారుతో అటుయిటు తిరుగుతున్నాడు. సంచి అంతా రక్తంతో తడిసిపోయింది. అల్లా తిరగటం, 'రహీం' భార్య గమనించి "ఏమండీ అలా వున్నారేం?" అంది. 'రహీం' కంగారుతో నీ వెవరితో చెప్పకు. ఒకపని చేశాను. దీనికి మందేమిటంటే, నువ్వు ఎవరితో సాయంత్రందాక చెప్ప కుండా, వుండడమే," అన్నాడు. అతని భార్య సంచి చూస్తే ఏముంది. సంచంతా రక్తంతో తడిసుంది! 'రహీం' భార్య కొయ్యబారింది. మాట తడబడ్తూ వస్తోంది. "నువ్వు కంగారుపడకు. నేను కోపన్ని, ఆపుకోలేక, ఒకణ్ణి చంపాను. ఎవ్వరైనా వాణ్ణి ఆనమాలు పడ్తారేమోనని అతనితల నరికి సంచిలో వేసుకొచ్చాను" అని 'రహీం' అంటూ ఎదురుగా వున్నపుట్టిమీద పెట్టాడు. భోజనం, చేయకుండానే గదిలోనున్న పట్టె మంచంమీద, నిద్రపోతున్నట్లుగా నటిస్తూ, ఏమి జరుగుతుందో అని కనిపెట్టున్నాడు.

'రహీం' భార్య గదిలో తొంగిచూచి, 'రహీం' నిద్ర పోతున్నాడనుకొని, భర్తను రక్షించాలనే భావంతో - తన

ప్రక్కింట్లో కాపురమున్న పోలీసు భార్యను పిలిచింది "అక్కా" అని. పోలీసు భార్య వచ్చింది "ఎందుకూ" అంటూ. 'రహీం' భార్య తడబడుతూ, పోలీసు భార్యతో "మా ఆయిన ఎవరినో చంపాఁట. దాంతో వూరుకున్నారా, ఏమన్నానా! అతని తల నరుక్కొచ్చి దాన్ని యింట్లో వుట్టి మీద పెట్టారు ఎలాగో ఈ గొడవలోంచి తప్పుకోటం" అంటూ. "మీరు మాత్రం ఎవరితో చెప్పకండి" అంది. అది విని పోలీసుభార్య మరెలాగ - అయ్యో బాగుంది, నేనెవరితో చెప్తాను! అంటూ నే వెళ్ళింది.

అంతట్లో పోలీసు భోజనాని కొచ్చాడు. పోలీసుభార్య తన భర్తకు అన్నంపెట్టూ పూసగ్రుచ్చినట్లు తన భర్తతో చెప్పటం ప్రారంభించింది. "ఏమండోయ్! చూశారూ! మన 'రహీం' ఎవరిదో తలనరికి, తల తీసుకొచ్చి తన యింట్లో, వుట్టిమీద పెట్టాట" 'రహీం' భార్య దిగులు పెట్టుకుంది ఏమవుతుందోనని, పాపం" అన్నది. పోలీసు మంచికేసే దొరికిందనుకున్నాడు. పైకి మాత్రం "ఏమవుతుంది ఫర్వాలేదు లే" అంటూ, అన్నంతిని "ఆరుసంవత్సరాలనుండి నాకు ప్రమోషనేలేదు. ఈదెబ్బతో డైరెక్టుగా సబ్ యిన్స్పెక్టరు అవొచ్చనుకొన్నాడు లోలోన.

ఒక్క నిమిషమైనా రెస్టు పుచ్చుకోకుండా, పోలీసుస్టేషను కెళ్ళాడు. ఒక అరగంటలోనే పోలీసు లారి 'రహీం' యింటెదుట ఆగింది. ఆ లారీలోనుంచి, సబిన్స్పెక్టరు,



"నువ్వు ఎవరితోనూ చెప్పకుండా వుండటమే"

హెడ్ కానిస్టేబులు, 'రహీం' ఇంటి ప్రక్కనున్న పోలీసు అవతరించారు. 'రహీం' పోలీసులకారు రావటం తన యింటెదుట - ఆగటం చూస్తూనే వున్నాడు 'కిటికీలోంచి. పోలీసువారు 'రహీం' యింటి తలుపు తట్టుతున్నారు. 'రహీం'కేం భయం ఏమన్నా నేరం చేస్తేగా! తన మిత్రుడు చెప్పింది నిజమే అనుకుంటూ నిర్భయంగా తలుపు తీశాడు.

నేరంచేసి 'రహీం' యింట్లోనే వున్నాడే అనుకున్నారా పెద్ద మనుష్యులందరు. పోలీసు యిన్స్పెక్టరు చరచరా వచ్చి వుట్టి దగ్గిర నిలబడ్డాడు. రక్తంతో తడిసి వున్న సంచిని చూచి "ఆసంచిని బైటికి తీ" అన్నాడు గంభీరంగా ప్రక్కనున్న పోలీసుతో. ఆమాట విని 'రహీం' తనలో తను నవ్వుకున్నాడు. ఆసంచి తీసి చూస్తే, ఏముంది? దాంట్లోవున్న మేకతల బైటపడింది.



# మొదటి రోజు

శ్రీ వి. సోమసుందర్రావు

ఆరోజు సెలవు పెట్టినట్లున్నాడు. రంగారావు వీధి వసారాలో పడక కుర్చీలో కూర్చుని చుట్ట కాలుస్తూ పేపరు చదువుతున్నాడు.

కళ్లు నులుపుకుంటూ, తలవాల్చుకొని మెల్లిగా ఇంట్లో ప్రవేశిస్తున్నాడు ప్రకాశ్.

రంగారావు పేపరు ప్రక్కన పెట్టి "ఏమిరా బడికి వెళ్ల లేదుట్రా?" జవాబు లేదు.........

"ఏమిరా వాడేదా నిన్నే"

.........

"ఏమిరా మూగ వాడివా...... మాట్లాడవు"

.........

ప్రకాశ్ కళ్ల నీళ్లు నిండాయి రంగారావుకు కోపం వచ్చింది. కుర్చీలోంచి లేచి జుట్టుపట్టుకుని ఈలె ఆలెంప పళ్లు ఊడేటట్లు కొట్టే.

ప్రకాశ్ చిన్నగా పెళ్ళమ్మ దగ్గరకుపోయి ఏడుస్తూ జరిగినదంతా చెప్పేడు.

"ఏడవకు నాయనా! మీనాన్నగారు ఎప్పుడూ ఇంతే ఏమి జరిగిందో తెలుసుకోకుండానే కొట్టారు సుఖాన ఉన్న బొందిని కష్టాన పెడతారు. నాకర్మ ఇలా కాలింది" అని ఇంక ఆవిడ కష్టాలు ఏక రేవు పెట్టింది

"నేను ఈరోజు అన్నం తినను" అంటూ ప్రకాశ్ గది లోకిపోయి మంచం మీద ముసుగు పెట్టి పరున్నాడు.

"ఏమండీ! పిల్లవాడిని అలా కొట్టారేం అంటూ ఆవిడ వీధిలోకి వచ్చింది.

"వాడు ఏమి అడిగినా జవాబు చెప్పకపోతే కోపం వచ్చింది. కొట్టను నీవున్నావుగా వెనక వేసుకురావడానికి, నీ మూలంగానే వాడు అలా తయారయాడు"

"ఆ మాత్రానికే అలా కొడతారా? వాళ్ళ తెలుగు మాష్టారు పద్యం చదవమంటే అంతమందిలో చదవలేదుట. ఆయనగట్టిగా కోప్పడేడుట పిల్లలంతా నవ్వేరుట. మాష్టారు ఇంటికి పొమ్మంటే వచ్చేసేడు. మీదగ్గర ఇది చెప్పడానికి భయపడ్డాడేమో ఏమో వాడు భోజనం చెయ్యనని పడుకున్నాడు ఏం చేస్తారో చెయ్యండి" అని రుసరుసలాడుతూ లోపలికి వెళ్లిపోయింది.

తప్పదురా భగవంతుడా అనుకొని రంగారావు ప్రకాశ్ పరున్న గదిలోకి వెళ్లాడు మెల్లిగా బుజ్జగించి ఇలా చెప్పాడు.

"నాయనా! ప్రకాశ్, నాకు నా చిన్నప్పుడు చదువు జ్ఞాపకం వచ్చింది. అది ఒక కథగా చెప్తాను విను" అని మంచం మీద కూర్చొని మొదలుపెట్టేడు రంగారావు—

నేను మూడవ ఫారం ప్యాసయినతరువాత బెజవాడ హైస్కూల్లో కాలేజీలో ఫోర్తుఫారంలో చేరాను

ఆరోజు రాత్రి నాకు నిద్ర పట్టలేదు. కారణం అది క్రొత్త ప్రదేశం అవటంవల్లనో, మరునాడు క్రొత్తగా పెద్దస్కూలుకి వెళ్లాలనో, పదిగంటల వరకు కార్లహారన్ల మోత వల్లనో మొత్తంమీద నిద్ర పట్టింది కాదు. ఇటు అటు దొర్లి నాలుగు గంటలకు కన్ను మూసేసరికి నా స్నేహితులంతా కలలో కనపడ్డారు. అప్పుడే ఎక్కడ తెల్లవారిందో ఐదు గంటలకే మొదలు కార్లహారన్లు.

బరువెక్కిన కళ్లతో లేచి కాలకృత్యాలు తీర్చుకొనేసరికి మాపిన్ని కాఫీకి పిల్చింది. నేను అంతకు ముందు ఎప్పుడూ త్రాగలేదేమో బలవంతాన త్రాగడం, కక్కువడం జరిగింది. ఆరోజు నాకు అక్కడ చద్ది అన్నం దొరకలేదు... బట్టలు వేసుకొని బడికి తయారయాను కాని గడియారం ముందుకు నడుస్తున్నట్లు కనపడలేదు.

తొమ్మిది గంటలు కొట్టేటప్పటికి స్కూలుకి వెళ్లి 'అక్కడ వరండాలలో ఆ స్కూలుని తలచుకుంటూ తిరుగుతున్నాను. బ చప్పుడు వినపడేటప్పటికి ఆగాను దగ్గరగా వస్తూన్న వ్యక్తిని చూస్తే ఎవరో మాష్టారుగారివలె కనపడ్డారు, వణుకుతూ ప్రక్కగా

నిల్చున్నాను. నా వైఖరి కనిపెట్టి ఆవ్యక్తి దగ్గరకు వచ్చాడు.

"ఏమిరా! ఇంతముందే వచ్చి వరండాలో వృథాగా తిరుగుతున్నావు" అన్నారు.

"నేను - క్రొత్త - గా-వ-చ్చే-న-ం-డి-సార్" అన్నాను.

"అదీ సంగతి. అలాచెప్పు"అని ఆయన నన్ను ఒకగదిలో బీరువా వెనుక ఎవరికీ కనబడకుండా నిల్చోబెట్టి, "నేను మళ్ళీ తిరిగి వచ్చే వరకు ఒక పుస్తకం తీసుకుని 'నేను ఎప్పుడు వరండాలో వృథాగా తిరుగను' అని వ్రాస్తూండ"మని చెప్పి వెళ్ళిపోయారు.

ఇదేమి స్కూలురా! భగవంతుడా అని పెన్సిలుతో వ్రాయడం మొదలుపెట్టాను గంటకు సగం పుస్తకం,. పెన్సిలుమొన పూర్తి అయేయి. ఇంక వ్రాయడం మానేద్దామా అంటే వచ్చి ఏం చేస్తారో' దమ్ముచాలింది కాదు. అందుచేత పెన్సిలు నేలను రాచి మొనచేసి మళ్ళీ మొదలు పెట్టేను.

రెండుగంట లైంది నేను ఆగదిలో ప్రవేశించి. ఆ రెండు గంటలలో పిల్లలు రావడం బడి జరగడం కూడా అవుతోంది. తలుపు చప్పుడు అయేటప్పటికి ఎదురు చూచేవాడిని మాష్టారు కోసం. కాని బీరువా తలుపు తీసి లోపల టిఫిన్ కారియర్లు పెట్టి వెళ్ళిపోయేవారే కాని ఆమాష్టారు రాలేదు.

ఆఖరిసారి తలుపు తీసుకొని ఆయన వచ్చేడు. నేను వ్రాసిన పుస్తకం చూడకుండానే తన వెంట తీసుకొని వెళ్ళేరు.



"నాయనా! ప్రకాశ్! నాకు నా చిన్నప్పుడు చదువు జ్ఞాపకం వచ్చింది..."

ఇక్కడ లేటుగావచ్చిన వారు క్లాసులో వెనుక బెంచిమీద నిల్చోని మాష్టారు కూర్చోమనే వరకు కూర్చోకూడదని చెప్పి

ఒక తరగతి గది చూపిస్తూ నన్ను వెనుక గుమ్మంనుండి లోపలికి పంపి తను వెళ్ళిపోయాడు. ఆతరగతి మాష్టరుగారు బోర్డు వైపు తిరిగి ఏదో లెక్కచేస్తున్నారు. పిల్లలంతా పుస్తకాలలో

# ★ మొదటిరోజు ★

వ్రాసుకుంటున్నారు. నేను వెనుక బెంచిమీద నిలబడి నిరీక్షిస్తున్నాను.

ఆ లెక్క పూర్తి అయింది. మాష్టరుగారు విద్యార్థులవైపు తిరిగారు నన్ను చూసి, "ఎవరు నీవు" అన్నారు.

"నే-ను - లే - టు - గా-వ-చ్చే నం-డి-సార్" అన్నాను వణకుతూ.

"ఏ ఫారం నీవు" అన్నారు.

"ఫో - ర్తు - ఫా రం - సార్" అన్నాను.

పిల్లలంతా ఫక్కున నవ్వేరు. నాకు చాలా సిగ్గేసింది. మాష్టరుగారు ఒక స్టూడెంటును పిలిచి నన్ను ఫోర్తు ఫారం క్లాసుకు పంపేరు.

ఆ తరగతిలో ఇద్దరం క్రొత్తగా వచ్చిన పిల్లలం. పాత విద్యార్థులతో కంటే మా ఇద్దరికి వెంటనే స్నేహం కలసింది. రామారావు నాకంటే వారం రోజులు ముందుగా చేరేడు. ఆవిధంగా ఉదయం బడి ముగిసింది.

మధ్యాహ్నం ఒంటి గంటన్నర అయేటప్పటికి స్కూలుకి వెళ్లేరు నేను, రామారావు తప్ప గదిలో ఎవరూ లేరు. అప్పుడు ఉదయం నాకు శిక్ష వేసిన మాష్టారు వరండాలో తిరుగుతున్నారు.

"రాము! ఉదయమే..." అని జరిగినదంతా చెప్పేను. రాము పెద్దగా నవ్వేడు. అతను మాష్టారు కారని మూడు సంవత్సరాల నుండి ఎస్. ఎస్. ఎల్. సి దండయాత్ర కొడుతున్న శంకర్ అని చెప్పాడు. ఎప్పుడూ ఏవో చిలిపిపనులు చేస్తూ ఉంటాడని నన్ను ఉదయం నిల్చోబెట్టినగది టిఫిన్ రూమ్ అని, అతను నన్ను ప్రవేశపెట్టిన తరగతి స్కూల్ ఫైనల్ క్లాస్ అనీ చెప్పేడు. నాకు ఎంతో సిగ్గేసింది. నా పుస్తకం అంతా చేతులు నొప్పి పెట్టేటంతగా వ్రాసినందుకు ఏడుపు వచ్చింది, కాని నవ్వేసి ఊరుకున్నాను.

మొదటి గంట తెలుగు మాష్టారు వచ్చేరు. క్లాసు నిశ్శబ్దముగా ఉంది. క్రొత్తగా వచ్చిన విద్యార్థిని గనుక నన్ను ఒక పద్యము చదవమన్నారు. తప్పులతో చదివేను? పిల్లలంతా ఫక్కున నవ్వారు. నాకెంతో ఏడుపువచ్చింది. రెండోగంట లెక్కల మాష్టారు వచ్చేరు. లెక్కలు చెపున్నారు. అంతలో పోస్టుమాన్ వచ్చి నాకు ఉత్తరం ఇచ్చాడు. అదే మొదటి సారి నాపేర ఉత్తరం అందుకొనడం. అది మా నాన్న దగ్గరనుంచి వచ్చింది. చదవడం చూశారు మాష్టారు పాఠం వినకుండా ఉత్తరం చదివినందుకుగాను బెంచీ మీద నిల్చోమన్నారు. ఎలాగో బడి పూర్తిఅయింది ఆరోజుకి. ఇంటి ముఖంపట్టి ఉత్తరం చదువుతూ పోతున్నాను. మాతరగతిలో అల్లరి వాడు వెంకట్రావు ఉన్నాడు. వాడు ఎక్కడనుండి వచ్చేడో వెనకనే వచ్చి నాచేతిలో ఉత్తరం లాక్కొని పరుగుచ్చుకున్నాడు. వాడివెనుక నేను పరుగెత్తేను.

ఆఖరికి వాడు ప్రక్కనున్న బురద కాలవలో పారేసిపోయాడు. అది తీసి బురదతుడిచి జాగ్రత్తగా ఇంటికి చేరుకున్నాను. భోజనం చేసినతరువాత నాగదిలో దీపం దగ్గిర ఉత్తరం మూడునాల్గు సార్లు చదువుకొని ఆరోజు జరిగినదంతా తలచుకొని, అంతకుముందు రాత్రి నిద్రలేక పోవడంవల్ల ఆరోజు చర్యలన్నీ కలగంటూ నిద్రపోయాను. ఇది నా మొదటిరోజు హైస్కూల్లో చదువు కథ. ఇంకలే భోజనం చేద్దాము"

ప్రకాశ్ మెల్లిగాలేచి ముసుగు తీసి "నన్ను ఎప్పుడూ కొట్టనంటే భోజనం చేస్తాను" అన్నాడు.

"నేను అడిగినదానికి జవాబు చెప్తానంటే నేను ఎప్పుడూ కొట్టను" అన్నాడు రంగారావు.

"ఒసేయ్! వడ్డించు మేము ఇద్దరం భోజనానికి వస్తున్నామని" రంగారావు కేక పెట్టేడు.

"అమ్మయ్యా కథ పూర్తి అయిందా? నేను అప్పుడే అనుకున్నాను. ఇంక ఈయనకథ మొదలు పెట్టేరు, ఉన్నవి లేనివి కల్పించి చెప్తారు, పన్నెండు టంగున కొడుతుందని. లేవండి భోజనానికి. వడ్డించేను" అంది.

భోజనాలుఅయాక రంగారావు, "ఈమాత్రం దానికేరా! భోజనం చెయ్యనని మారాం చేసేవు" అన్నాడు.

"నాన్నా నేను గాంధీగారికి, పొట్టి శ్రీరాములుగారికి శిష్యుడిని. సత్యాగ్రహం చేసి స్వాతంత్ర్యం సంపాదించాను. చూడు నన్ను ఇంకెప్పుడైనా కొట్టేవంటే పొట్టి శ్రీరాములుగారిలా భోజనం మానేసి చచ్చిపోతాను"

# దెయ్యం వదిలింది

శ్రీ బసిరెడ్డి ఈశ్వరరెడ్డి

"తాతా ఒక కథ చెప్పవూ" రామిరెడ్డీ కిట్టప్పా సుశీలా రామచంద్రుడూ అందరూ తాతయ్య నులకమంచం చుట్టూ చేరారు. 80 ఏండ్ల తాతయ్య శరీరం జీర్ణించిపోయింది గానీ ముఖం మాత్రం ఎప్పుడూ ఉత్సాహవంతంగా ఉంటుంది. కొందరు ముసలివాళ్లు పిల్లలంటే చిర్రుబుర్రుమంటారు కానీ ఈ తాతయ్యకు పిల్లలంటే చెప్పలేని హుషారు. పండిపోయిన తన అనుభవాలన్నిటినీ కథలరూపంగా చెబుతాడు. తాతయ్య కథలంటే క్రిష్ణాపురంలోని పిల్లలందరూ చెవిగోసుకుంటారు.

"ఏమి కథలు చెప్పన్రా. అన్నీ అప్పుడే చెప్పేశానే" అన్నాడు తాతయ్య.

"ఆ లంబాడీ దయ్యం కథ తాతా" అన్నాడు కిట్టప్ప. రామిరెడ్డి "నువ్వు నోరుమూసుకోవోయ్. మహా చెప్పమంటావ్. తరువాత దెయ్యంకథ చెప్పితే ఉలికులికి పడతావ్" అన్నాడు. రామిరెడ్డి కిట్టప్పకంటే రెండేండ్లు పెద్దవాడు, ధైర్యశాలి.

తాతయ్య "దెయ్యంకథే చెప్తాను. అదికాదు యింకొకటి" అన్నాడు. పిల్లలంతా దగ్గరకు చేరారు. రామిరెడ్డి "ఊ" కొట్టేవాడు కాబట్టి మెడలో పాములవాడి ననుకరించడానికి వేసికొన్న బెల్టు తీసివేసి గంభీరంగా ప్రథమంలో కూర్చున్నాడు. రామచంద్రుడు చేతిలోని కొబ్బెరముక్కరుచో, పండ్లమధ్యలో నగిషీ చేయబడుతూండే బలపంరుచో తెలియక వితర్కిస్తున్నాడు. సుశీల మంచం కింద పిల్లిలా నక్కింది. కొలువుకూటం డజనుమంది బాలభటులతో నిండింది. తాతయ్య ప్రారంభించాడు. 60 ఏండ్లనాటి అనుభవం హృదయంలో కదం దొక్కుతున్నది—

అప్పుడు నాకిరవైఏండ్లు. ఆచారిగారు నాకంటే పదిహేనేండ్లు పెద్ద. ఈప్రాంతంలో ఆయనకి చాలా పెద్ద పేరుడేంది. ప్రజలంతా అతడంటే భయపడేవారు. గౌరవించేవారు. అతడు రాతిలోనుంచీ నీళ్లు తెప్పిస్తాడట. పిశాచాలచే నీళ్లు మోయిస్తాడట. యింకా ఏమేమో చేస్తాడట. గురువుగారికి శక్తులున్నాయో లేదో గానీ, ఆయన పాదసేవచేస్తే హస్తసాముద్రికమూ, పాముకాటుకు యిశ్వరీవేరూ చెబుతాడని నాఆశ. మేమిద్దరమూ పట్టణాలూ పల్లెలూ అడవులూ తిరుగుతూ చివరకు రామాపురం చేరుకున్నాము. రెండు రోజుల్లోనే గురువుగారు పరిస్థితినంతా ఆకళింపు చేసుకొన్నాడు. "ఒరే అబ్బాయ్. యీవూళ్లో మనం మంత్రగాళ్ళం తెలుసా" అన్నాడు. చిత్తమన్నాను. యీ ఆరునెల్లలోనే గురువుగారి మాయ నాటకాలు నాకు కొంచం తెలిసివచ్చాయి.

తెల్లవారకమునుపే గురువుగారు స్నానంచేసి శక్తిపూజకు కూర్చొనగానే ఎవరో కొత్తమనిషి గబగబా పరిగెత్తుకొని వచ్చాడు. సరాసరి పూజాగృహంలోనికే. శక్తి సాక్షాత్కారం చేసికొనే సమయంలో ఎవ్వరినీ ససేమిరా యింట్లోకి రానివ్వ వద్దని గురువుగారు ఘట్టిగా చెప్పి నన్ను కాపలాపెట్టినా లాభం లేకపోయింది. ఆ కొత్తాయన వింటేగదూ! ముమ్మారు సాష్టాంగ నమ

---

"ఛా! అదేమిటిరా నాయనా! శుక్రవారంపూట అయిన రంధి అంతా చాలక చావు కోరుతున్నావు" అంది ఆవిడ.

"తప్పు నాయనా! ఎప్పుడు మంచి కోరాలి గాని చెడు కోరకూడదు. ధైర్యంగా పట్టుదలతో చదువుకొని దేశంకొరకు పాటుపడు" అన్నాడు రంగారావు. ప్రకాశ్ సత్యాగ్రహంలో అది మొదటిరోజు. రెండవరోజుకి నిరీక్షిస్తున్నాడు. ★

# ★ "దెయ్యం వదిలింది" ★

స్కారంచేసి భయభక్తులతో గురువుగారి ఎదుట నిలబడ్డాడు. నోటి నుంచీ మాటపెకలదు. చూట్టానికి గురువుగారు బక్కచిక్కి సగం పీనుగలాగుంటారుగానీ చెవుల్లో కుండలాలూ మెడలో రుద్రాక్ష మాలలూ ఒళ్ళంతా విభూది పూసుకొని రౌద్రంతో శాంభవీ మంత్రం జపిస్తుంటే ఎంతటివాడైనా వణికి పోవలసిందే. మాటా మంతీ కుశల ప్రశ్నలూ అయిన తరువాత అసలు విషయం చెప్తున్నారు గురువుగారు.

శివయ్య ఆ ఊళ్ళో మోతుబరి రైతు. అతని కూతురు రంగమ్మ పేరుచెప్పితే ఊరంతా హడల్. ఆ అమ్మాయి అసలే గయ్యాళి. దానికితోడు వారానికి రెండు సార్లైనా దెయ్యం ఆవేశిస్తుంది. శివ మొత్తినప్పుడు జుట్టు పీక్కొని ఒళ్ళంతా రక్కుకొని నానా హంగామా చేస్తుంది. ఏమైనా కోరికలున్నప్పుడూ, కొత్తచీర కావలసినప్పుడు, అత్తగారింటికి పొమ్మన్నప్పుడు మాయదారి దెయ్యం దాపురిస్తుంది. ఈ దెయ్యాన్ని తృప్తిపరచడానికి అతని యిల్లంతా గుల్లైపోయింది. ఎందరెందరో భూతవైద్యులకూ మంత్రగాళ్ళకు చూపించాడు. విసిగి వేసారిపోయిన శివయ్యకు మా గురువుగారు సాక్షాత్తు త్రిమూర్తి వలె కన్పించాడు. ఆడబోయిన తీర్థం ఎదురయ్యింది.

మాగురువుగారు క్షణంలో అంతా అర్థం చేసికొన్నారు. దెయ్యాన్ని వదిలిస్తే మంచి సంభావన లభిస్తుంది. కానీ ఒక చిక్కు. లేని దెయ్యాన్ని వదిలించడమెట్లా? రంగమ్మ ఆటకట్టించే దెలాగా? మర్యాదగా చెబితే దెయ్యం వదుస్తుందా? నాలుగైదు రోజులు గురువుగారు దీర్ఘంగా ఆలోచించారు. చివరికి ఒకప్లాను స్ఫురించింది "ఒరే అబ్బాయ్" అన్నారు.

"చిత్తం గురూజీ" అన్నాను.

తను వేసికొన్న ప్లానంతా విశదీకరించి "యిలా చేస్తావ్రా?" అన్నారు.

"అమ్మ బాబోయ్. నావల్ల కాదండీ" అన్నాను.

"నువ్వుచేసి తీరవలసిందేరా" అన్నారు.

"అసాధ్యం గురూ" అన్నాను.

"ఏమి చెయ్యమన్నాడు తాతా" అని ప్రశ్న వేశాడు రామచంద్రుడు.

చెబుతున్నాను గదా అప్పుడే చెప్పితే స్వారస్యమంతా చచ్చిపోదూ్రా వెధవనాగన్నా. యీ విధంగా గురువుగారు పట్టుపట్టేసరికి నేనూ ఒప్పుకొన్నాను.

మర్నాడు నిండు అమావాస్య. ఎక్కడా కన్నుపొడుచుకొన్నా కనిపించదు. ఊరికి మూడుఫర్లాంగులలో శ్మశానం.

అర్థరాత్రి శ్మశానంలో ముగ్గురు మనుష్యులు, రంగమ్మ నిలబడి ఉన్నారు. శివయ్య ఆలోచిస్తున్నాడు. సన్నగా దీపం మసకగా మిణుకు మిణుకు మంటున్నది. గురువుగారు ముగ్గులుపెట్టి యంత్రం వేసి నల్లకోడిని చంపి రక్తాన్ని యంత్రంపై వేశాడు. అష్టదిగ్బంధనం చేశానన్నాడు. శాంభవీ మంత్రాన్ని ముమ్మారు జపించాడు. రక్త చందనాన్ని ఒళ్ళంతా పూసుకొన్నాడు. రౌద్రంతో గర్జించాడు. "యిక భేతాళుడా వేశిస్తాడు పొమ్మ"ని గద్దించగానే శివయ్య దూరంగా పోయి నిలబడ్డాడు.

"రారా భేతాళా" అన్నాడు గురువుగారు కోపంతో.

ఒక క్షణం అంతా మాయ. ప్రమానుమీదనుంచీ ఆపళంగా రంగమ్మపైకెగిరి దుమికింది దెయ్యం. వొళ్ళంతా రోమాలూ, మెడలో పేగులూ, చేతిలో పుర్రె, సాక్షాత్తు భేతాళుడే. కుప్పించి లంఘించి హుంకరించి రంగమ్మపై బడ్డది. క్షణంలో రంగమ్మ నడుం విరిగింది. ముక్కు చితికింది. పళ్ళు రాలినయ్. వొళ్లు విరిగిపోయింది, భేతాళుని చావుదెబ్బలకు. క్షణంలోనే భేతాళుడు మటుమాయమైపోయాడు. ఆ క్షణం నుంచే రంగమ్మను దెయ్యం శాశ్వతంగా విడిచిపెట్టిపోయింది. శివయ్య సంసారం బాగుపడ్డది.

పిల్లలంతా దెయ్యం వర్ణన విని వణికి పొయ్యారు. ధైర్యశాలి రామిరెడ్డి కూడా భయపడ్డాడు. "అది దెయ్యమేగదూ తాతయ్యా" అన్నాడు రామచంద్రుడు. "ఓరి చవటా దెయ్యమూ గియ్యమూ అబద్ధంరా; ఆ భేతాళుడు నేనేరా" అన్నాడు తాతయ్య. పిల్లలందరూ ఒకక్షణం విభ్రాంతులయ్యారు. మరు క్షణం పొట్ట చెక్కలయ్యేట్టు నవ్వారు తాతయ్య చమత్కారానికి. ★

 

# తేలు కుట్టిన దొంగ

(35-వ పేజీ తరువాయి)

దానిమీద పడేసేను నా వెంపుకు రాకుండా. అమ్మ బట్టల మూట కోసం వస్తోందన్న సంగతే మరిచాను. అమ్మ మంచందగ్గర కొచ్చింది. ఈ లోపుగా నేను మంచంమీది నలుపుకోక వెనకాలవేపునుంచి లాగి మంచం క్రింది చీకట్లో కనబడకుండా కప్పేసుకున్నాను. బాధ అంతకంతకు ఎక్కువైపోతోంది. కళ్ళనీళ్ళకి బనీనంతా తడిసిపోయింది. వేలు వాచిపోయింది. కీచుమని లోపలే ఏడుస్తున్నాను. మాఅమ్మ వొంగి మంచంకింద బట్టలమూట అడుగున చెయ్యివేసి తీయపోయింది. అక్కడే వున్న తేలు పుటుక్కున కుట్టింది మాఅమ్మని. "అమ్మయ్యో, తేలండోయ్" అంటూ గట్టిగా అరిచింది. "ఎక్కడా ఎక్కడా" అంటూ నాన్నారు సావిట్లోనుంచి కర్ర తీసుకువచ్చారు.

"మంచంక్రిందండోయ్ బాబూ, తొరగా చంపండీ" అంది అమ్మ మూలుగుతూ. మానాన్న మంచం క్రింద దూరేరు.

నాకు ఉక్రోషం, బాధ మరీ ఎక్కువై యింకెలాగా పట్టుబడి పోతానని ముసుగుతీసి "నాన్నగారూ నన్నూ కుట్టిందండోయ్ బాబోయ్" అంటూ గట్టిగా ఏడుస్తూ బయటి కొచ్చేసేను.

"దొంగవెధవా ఎత్తు వేసేవా? ఏడుస్తే ఏం అనను కదా అని! ముందు ఆ అయిదు రూపాయిలు అక్కడపెట్టు" అంటూ నాన్నారు నన్ను నాల్గు గట్టిగా మొట్టారు. మంటలో నెయ్యి పోసినట్టయింది. ఆయేడుపు, యీయేడుపు కల్సి యింకా గట్టిగా ఏడుస్తూ, అయిదు రూపాయిలనోటు బనీనులోంచి తీసి క్రిందపారేసి, "నిజంగా కుట్టిందండోయ్ నాన్నారూ" అని గంతులు వెయ్యడం మొదలుపెట్టాను.

"ఏమండోయ్! ఆగండి ఏమిటది! అనవసరంగా వాణ్ణి కొడ్తారెందుకు? నిజంగా కుట్టేవుండొచ్చు. నన్ను కుట్టగాలేంది వాణ్ణి ఎందుకు కుట్టదు" అని కసిరింది ఏడూస్తూ అమ్మ. అప్పటికి నమ్మకం కలిగింది నాన్నారికి.

"ఉండండి సుబ్బావధాన్లని పిలుస్తాను" అని బయటికి పోయాడు. యిల్లంతా సన్నాయిమేళం అయిపోయింది. ఇవతల మేమిద్దరమే కాకుండా ఏమీ కుట్టని చెల్లెందుకో ఏడుస్తోంది? "ఓ చెల్లీ! ఊరుకోవే నీకు పుణ్యంఉంటుంది" అన్నాను.

ఇంతట్లోకే సుబ్బావధాన్లు వచ్చి మాఅమ్మకి, నాకు మంత్రంవేసి నిరుల్లిపాయలు, జామాకులు నలక్కొట్టి ఇంతముద్ద మాయిద్దరికీ చేతులమీద కుట్టినచోట పట్టించి "యీవాల్టికి పట్టి మజ్జిగ పోసుకొని తప్ప మరేమీ తినకూడదని" చెప్పి వెళ్లిపోయాడు.

కొంతసేపటికి మా యిద్దరికీ నిమ్మళించింది. సద్దు మాటు మణిగింది. కాని మాఅమ్మ యింకా కూనిరాగాలు తీస్తూనే వుంది. మా నాన్న నిష్ఠూర్పులతో మాయిద్దరికే విసురుతున్నారు.

"ఈ వెధవ దొంగతనం ఎక్కడా ఎరగనివాడవ్, యిలా మొదలెట్టావేంరా" అని కూకలేసింది మాఅమ్మ.

పొద్దున్న అమ్మ నాకిష్టమైన ఆవళ్ళు వండింది. ఈ దొంగతనం చెయ్యకపోయినట్లయితే అవి తినుండే వాణ్ణి. అవధాన్లు మజ్జిగఅన్నం తప్ప మరేమీ తినకూడదన్నాడు. మజ్జిగా అన్నంగతి పట్టింది నాకు. మాఅమ్మ నేనూ కళ్ళనీరు కారుస్తూ పీటలదగ్గిర కూర్చున్నాం. మా నాన్నారు కాకినాడ వెళ్లిపోయారు. డబ్బుంటే మానాన్నారే యిచ్చేవారు. అర్జంటు పనిమీద ఆ అయిదు వాడుకొన్నారు కాబోలు, అనుకున్నాను. ★

---

ఆ రోజున స్కూలులో ఇన్‌స్పెక్షన్.

ఇన్‌స్పెక్టరు: (ఒక కుర్రవానితో) రామాయణం ఎవ్రరా రాశారు?

కుర్రవాడు: నేనుకాదండీ-

మేష్టరు: నిజంగా వీడే వ్రాశాడండి సార్; ఈమధ్య జ్వరం వచ్చినప్పుడు. తమరిని చూసి భయపడి అలా అంటున్నాడు సార్.

ఇన్: ఏం మేష్టరు ఉద్యోగం చేస్తున్నావయ్యా! రామాయణం రాముడు వ్రాశాడని, భారతం పాండవులు వ్రాశారని నీకయినా తెలీవద్దూ? అందుకనే నేటి కంపల్సరి ఎడ్యుకేషన్ అలా ఏడుస్తూంది...

శ్రీ పెద్ద స్వామినాయుడు, నర్సీపట్నం.

 # "దేవదాసు" సమీక్ష 

గత మాసం 26 న వినోదావారి "దేవదాసు" ఆంధ్రలో విడుదలయింది. ఈమధ్య చాలా తెలుగు చిత్రాలను తిరస్కరించిన ఆంధ్ర ప్రేక్షకులు ఈ చిత్రాన్ని బాగా ఆదరించారు. చిత్రం రసవంతంగా ఉంటే దానికిక ఢోకా లేదని, ప్రజల కొనుగోలుశక్తి తగ్గిపోవడం మొదలైన కారణాలేమీ చిత్ర విజయానికి అడ్డురావనీ దీనివల్ల స్పష్టమవుతోంది. ఈ చిత్రంతో వినోదావారు తెలుగు చిత్రరంగంలో స్థిరపడ్డారనీ, ఈ చిత్రం తయారుచెయ్యడంలో చూపిన జాగ్రత్తను, పడిన శ్రమను కొనసాగిస్తే ఇకముందు కూడా ఇలాంటి మంచి చిత్రాలే తీయగలరనీ నిస్సందేహంగా చెప్పవచ్చు.

ఇంత మంచి చిత్రం నిర్మించి కూడా విడుదలకు ముందు పత్రికలవారి కెవరికీ ప్రివ్యూ ఇవ్వకపోవడంబట్టి, నిర్మాతలు తమ చిత్రానికి ఇంత విజయాన్ని ఆశించి వుండరని భావించవలసివస్తుంది. తరవాత ఈ నెల 5 వ తేదీన వాహినీ స్టూడియోలో ప్రొజెక్షను వారు కొన్ని పత్రికలను ఆహ్వానించారు.

బెంగాలీ చిత్రాలు, నవలలు మాతృకలుగా ఇదివరలో కొన్ని తెలుగు చిత్రాలు వచ్చాయి. వాటిల్లో ఏదీ "దేవదాసు"లాగ మూలానికి సన్నిహితంగా, మూలంయెడల శ్రద్ధాయుతంగా నిర్మించబడలేదు. "దేవదాసు" కథ రచించిన శరత్ బాబుకు వినోదావారు ఆట్టే అన్యాయము చెయ్యకపోగా, కథను చిత్రించడంలో నేర్పు చూపి కృతకృత్యులయ్యారు.

శరత్ బాబుకు పేరు తెచ్చిన మొదటి నవలల్లో "దేవదాసు" ముఖ్యమైనది. ఈ నవలతోనే శరత్ పేరు ఆంధ్రదేశంలో కూడా విస్తరించింది. దాని తరవాత శరత్ అసంఖ్యాకంగా నవలలు రచించాడు కాని, వాటిలో ఏదీ "దేవదాసు" పొందిన ప్రజాదరణ పొందలేదు. ఈ నవలలో ఉన్నంత విస్పష్టత, ఏకాగ్రత మరే నవలలోనూ లేకపోవడం, శరత్ బాబు పోను పోను మరీ ఆదర్శవాది కావడం, అతని పాత్ర చిత్రణలో వైవిధ్యం తగ్గిపోయి తత్త్వచర్చలు ఎక్కువ కావడం ఇందుకు కారణాలై వుంటాయి. "దేవదాసు"ను న్యూథియేటర్సువారు చాల ఏళ్లకిందటే హిందీ, బెంగాలీలలో సినిమా తీశారు. హిందీలో కే. శే. సైగల్ దేవదాసుగా నటించి గంభీరమైన నటనతోను, విషాదమధురమైన సంగీతంతోను చిత్రాన్ని రాణింపజేశాడు. బెంగాలీ చిత్రంలో దేవదాసుగా నటించిన కే. శే. బారువా సైగల్ కంటే ఉత్తమంగా నటించాడని ఆ చిత్రం చూచినవారు చెబుతున్నారు. రెండుభాషల్లోనూ, పార్వతిగా జమున నటించింది; చంద్రముఖిగా ప్రసిద్ధనటి రాజకుమారి నటించింది. ఈ చిత్రం యావద్భారతంలోనూ పెద్ద 'బాక్సాఫీస్ హిట్' అయి న్యూథియేటర్సుకు పేరు ప్రఖ్యాతులార్జించి పెట్టింది. ఈ చిత్రం ఎదట పెట్టుకుని అదే కథను తెలుగులో పునర్నిర్మించడం సాహసమైనా వినోదావారు స్వతంత్రమైన ప్రతిభ చూపి చాలవరకు విజయులయ్యారనే చెప్పాలి.

ఈచిత్రం రక్తికట్టడానికి బాధ్యత నిర్మాణంలో పాల్గొన్న యావన్మందిదీనని తోస్తుంది. నటీనటులు బాగా నటించినా, దర్శకుని తెలివి తక్కువతనంవల్ల అంతా



వినోదావారి "దేవదాసు"లో పార్వతి సవతి కొడుకుగా నటించిన కొత్తనటుడు జి. వి. జి. కృష్ణ.



వినోదావారి "దేవదాసు"లో ప్రముఖులు: దర్శకుడు వేదాంతం రాఘవయ్య, కెమేరా రంగా, దేవదాసు నాగేశ్వరరావు, చంద్రముఖి లలిత!

బూడిదలో పోసిన పన్నీరు కావడం మన మెరుగుదుము. ముఖ్యంగా "దేవదాసు" స్క్రిప్టు రాసినవారెవరయినా చాలా జాగ్రత్తగా రాశారు. అనవసరమైన సన్నివేశాలు జొరబడకుండా, హాస్యం ఉండాలి కదా అని చెప్పి హాస్య సన్నివేశాలు జొప్పించి కథ 'మూడ్' చెడగొట్టకుండా, ప్రధానపాత్ర అయిన దేవదాసు కొక్కడికే ప్రాముఖ్యం ఇచ్చుకుంటూ, మిగతా పాత్రలను జాగ్రత్తగా, మోతాదుగా ఉపయోగించుకుంటూ స్క్రిప్టురాశారు.

కథ చాలా సులభంగా, స్పష్టంగా, సూటిగా కథనం చెయ్యబడింది. ప్రధాన సమస్యను ప్రతిప్రేక్షకుడూ అర్థంచేసుకోగలిగినంత స్పష్టంగా 'ఎస్టాబ్లిష్' చేశారు. ఈమధ్య దెబ్బతిన్న తెలుగు చిత్రాల్లో కథను సూటిగా స్పష్టంగా చెప్పలేక పోవడం, అసలు సమస్య ఏమిటో ప్రేక్షకుడికి తెలపలేకపోవడం కన్పిస్తుంది. ఈ చిత్రంలో ఆలోపం లేదు.

"దేవదాసు" కథ 'లైలా మజ్నూ' లాగ ప్రపంచ ప్రసిద్ధి పొందదగిన ప్రేమ కథ. ఇందులో కూడా చిన్నప్పటినుండీ ప్రేమించుకున్న యువతీ యువకుల ప్రేమ వారి తల్లిదండ్రుల మూర్ఖత్వంవల్ల విఫలం కావడం కథావస్తువు. అయితే ఈ రెండు కథలకూ అంతే సామ్యం. పాత్రచిత్రణంలో తేడా చాలా వుంది. 'లైలామజ్నూ'లో లైలా ఖాయేజ్‌లను కలవకుండా చెయ్యడానికి తలిదండ్రులు, సంఘం, ప్రకృతి శక్తులు ఏకమై ప్రయత్నించినట్టు తోస్తుంది. లైలా ఖాయేజ్‌ల సంయోగానికి భౌతిక ప్రతిబంధకాలే ఎక్కువ ఉన్నాయి. "దేవదాసు"లో అలా కాదు. దేవదాసు చంచలచిత్తుడు కావడం, పార్వతి అభిమానవతి కావడం వారి ట్రాజెడీకి ముఖ్యకారణాలైనాయి. వారు తలుచుకుంటే ఏనాడైనా లేచిపోయి సుఖంగా జీవించకలిగేవారు. కాని వారి స్వీయమన స్తత్వాలే అందుకు ప్రతిబంధకాలైనాయి. పార్వతి అర్ధరాత్రి తన గదిలోకి వచ్చి ప్రేమభిక్ష యాచించినప్పుడే దేవదాసు తండ్రిని ధైర్యంగా ధిక్కరించడానికి పూనుకున్నా, లేక దేవదాసు పట్నం వెళ్ళిపోయి మళ్లీ మనసు మార్చుకుని తన దగ్గిరికి వచ్చినప్పుడు పార్వతి అతన్ని వివాహమాడడానికే అంగీకరించినా వారి ప్రేమ ఫలించే అవకాశం ఉండేది. మరొక పెద్ద తేడా ఏమంటే, లైలా ఖాయేజ్‌ల మన స్తత్వాలు ఒకటే. పార్వతి, దేవదాసుల మన స్తత్వాలు భిన్నమైనవి. పార్వతి దేవదాసుపై ప్రేమ కోల్పోకుండానే గుండె దిటవు చేసుకుని వృద్ధ భర్తతో కాలక్షేపం చేయకలిగింది. దేవదాసుకూడా మరొక స్త్రీని వివాహమాడి ఏదోవిధంగా కాలక్షేపం చేయకలిగితే ఇరువురూ ఒడుదుడుకులు లేని జీవితం సాగించేవారు. కాని దేవదాసు దుర్బలుడు కనుక మద్యవ్యసనానికి లోనై జీవితం చేతులారా పాడుచేసుకుని విషాదమయమైన అంతంపొందాడు.

కనుక "లైలా మజ్నూ"కు, "దేవదాసు"కు ప్రధానమైన భేదాలున్నాయి. ఈ భేదాలు లేకపోతే "లైలా మజ్నూ" తరవాత వచ్చిన వినోదావారి "దేవదాసు" ఇంతగా ప్రజల నాకర్షించేది కాదేమో.

శరత్ దేవదాసుకూ, వినోదావారి దేవదాసుకూ కొన్ని తేడాలున్నాయి. ఈ తేడాలవల్ల నిర్మాతలు దేవదాసు పాత్రను తెలుగు ప్రేక్షకులకు బాగా అర్థమయ్యేటట్లు చేసినమాట నిజమే గాని, మూలంలోని వాస్తవిక పాత్రీకరణం రాలేదు. మూలంలోని దేవదాసు తనకూ పార్వతికీ మధ్యగల సంబంధంయొక్క స్వరూపమేమిటో స్పష్టంగా ఎన్నడూ గ్రహించలేదు. పార్వతి తనంత తను వచ్చి 'నన్ను పెళ్ళిచేసుకో' అని అడిగినదాకా అతనికి ఆమెను పెళ్ళాడాలనే భావమే కలగలేదు. రెండోసారి అతడు కలకత్తానుంచి తిరిగి రావడంకూడా, పార్వతి తను లేకపోతే ఏమయిపోతుందోననే భయంచేతనే గాని తను కూడా ఆమెను ప్రేమిస్తున్నానని తెలిసి కాదు. కాని ఎప్పుడైతే పార్వతి తనకు శాశ్వతంగా పరాయిదైపోతుందో అప్పటినుంచే ఆమె లేని లోటు అతనికి బాగా తెలిసివస్తుంది. ఈ తెలిసి రావడం ఆలస్యంగా జరిగింది కనక అతడు నిస్సహాయుడై గాలి ఎటువీస్తే అటు కొట్టుకుపోయే ఎండుటాకులాగ అవుతాడు. ఈ పాత్రీకరణం హిందీ "దేవదాసు"లో



"బాలమ్ ఆయే బసో మోరె మన్ మే"—
హిందీ "దేవదాసు"లో సైగల్, పార్వతిగా జమున.



వేశ్యావాటిలో అస్థిరచిత్తుడైన దేవదాసు—

న్యూథియేటర్స్‌వారి హిందీ "దేవదాసు"లో దేవదాసుగా సైగల్, అతని మిత్రుడు చున్నీలాల్‌గా ఖోర్, చంద్రముఖిగా రాజకుమారి.

యథాతథంగా కనిపిస్తుంది. కాని తెలుగు "దేవదాసు"లో దేవదాసుకు మామూలు సినిమా హీరోల్లాగ మొదటినుంచీ తను పార్వతిని ప్రేమిస్తున్నట్టు తెలుసు. ముఖ్యంగా దేవదాసు పార్వతుల బాల్య సన్నివేశాలు ఈ చిత్రాన్ని మామూలు సినిమాల స్థాయికి దింపివేశాయి. పెద్దయిన తర పాత్ర తండ్రితో ఖచ్చితంగా చెబుతాడు తను పార్వతినే పెళ్ళిచేసుకుంటానని. తండ్రి తన్ను చంపి మరీ పెళ్ళిచేసుకో మనగానే బెదిరిపోయి పట్నం వెళిపోతాడు. తరవాత తిరిగి పార్వతివద్దకు వస్తాడు. అప్పుడు తండ్రి బెదిరింపునెల్లా ఎదుర్కో దలుచుకున్నాడో దర్శకుడు స్పష్టం చెయ్యలేదు. ఇక్కడ మూలానికి కొంత అన్యాయం జరిగినా, అంత పట్టించుకో నవసరం లేదు.

ఇదిగాక మూలంలో ప్రధాన కథకు అంతగా అవసరంలేని కొన్ని అంశాలు వదిలివేసి, కొన్ని చేర్చి మార్పులు చేశారు. వీటివల్ల పెద్ద నష్టమేమీ లేదేమో.

ఇకపోతే చంద్రముఖి పాత్ర; మరపు రాన్ని- నిసర్గమనోహరమైన పాత్ర! స్త్రీ మీద శరత్ బాబుకున్న సానుభూతి, పూజ్య భావం అనంతమైనది; స్త్రీలో అతడు లాల సతనుకాక సహనం, త్యాగం, మాతృత్వం, ప్రేమ మొదలైన గొప్పగుణాలనే చూశాడు. అతడు చిత్రించిన వందలాది స్త్రీ పాత్ర లన్నిటిలోనూ ఈ గుణాలే కొంచెం హెచ్చు తగ్గులతో కనిపిస్తాయి. చంద్రముఖి అటువంటి పాత్రల్లో ఒకతె. ఆమె సామాన్యమైన పడుపుగత్తె. దేవ దాసును చూచినప్పటినుంచీ అతనిపై ప్రేమ కలుగుతుంది. అతడు తన వృత్తిని నిందించి నప్పటినుంచీ కొత్తజీవితం సాగించబూను కుంటుంది. తను బాగుపడడానికి కారకు డైన దేవదాసు చెడిపోతుంటే చెప్పరాని వ్యథపడుతుంది. అతడు రోగగ్రస్తుడయితే ఎంతో సేవచేస్తుంది. అతడు తన్ను ప్రేమించడంలేదని తెలిసికూడా అతని బాగునే కోరుతుంది. పార్వతి తనభర్తతో కాపరం చేస్తున్నట్టే దేవదాసుకూడా తలుచుకుంటే చంద్రముఖితో సంసారం చెయ్య కలిగి వుండును. కాని చరిత్రహీనయైన చంద్రముఖిని కూడా అతడు అంగీకరించలేక పోతాడు. అతడు తన దౌర్బల్యం గుర్తించికూడా దానినుండి బయట పడలేడు. బయటపడడానికి ప్రయత్నించడం వృథాగనక ప్రయత్నించనుకూడాను. కోరి కోరి పతనం వైపే ప్రయాణంచేసి అంతరిస్తాడు. అతని పాత్ర మన సానుభూతిని, జాలిని పూర్తిగా చూరగొంటుంది.

ఈకథను ఆమోమయంగా, విసుగుపుట్టే టట్లుగా తయారుచెయ్యడానికి అనేక అవకాశాలున్నా దర్శకుడు చాలా నేర్పుతో, ఎట్టిక్లిష్టతలేకుండా, సుబోధకంగా చిత్రించారు. అందుకాయన్ని అభినందించాలి. కొన్ని దృశ్యాలు అత్యంత కరుణామయంగా నడిచాయి. మొదట కొంత పేలవంగా ప్రారంభమయినా దేవ



అంతిమకాలం ఆసన్నంకాగా పార్వతి సన్నిధి చేరుకోడానికి ప్రయాణిస్తున్న దేవదాసు.

హిందీ "దేవదాసు"లో ధర్మదాసుగా నీమో, దేవదాసుగా సైగల్.



కొడుకు సహాయంకోసం బయలుదేరుతూన్న భాగ్యను శేషయ్య వారిస్తున్నాడు.
నేషనల్ ఆర్ట్సువారి "పిచ్చిపుల్లయ్య"లో యన్. టి. రామారావు, హేమలత, కోడూరి అచ్చయ్య.

# ★ "దేవదాసు" సమీక్ష ★

దాసు పార్వతిసంబంధం తెడిపోసికొట్టిన దగ్గర్నించీ రసవంతంగావుంది.

ఇక నటీనటులు: మొదట పేర్కొనవలసింది నాగేశ్వరరావుని. దేవదాసు వంటి క్లిష్ట పాత్రను ఆయన నిర్వహించగలడా అని అనుమానించినవారికి ఆయన నటన చూసిన తరవాత సంతృప్తి కలుగుతుంది. దేవదాసు పాత్రను ఒక చాలెంజిగా స్వీకరిస్తున్నానని ఆయనే అనేకసార్లు అన్నాడు. అతిశ్రమకులోనై, పాత్రలో లీనంకావడానికి ఆయన ప్రయత్నించాడు. ముఖ్యంగా తాగుబోతుగా, రోగిష్ఠిగా ఆయన చూపిన నటన విస్మయకరంగా వుంది. బాలరాజులో నటించిన నాగేశ్వరరావుకూ దేవదాసులో నాగేశ్వరరావుకూ ఎక్కడా పోలికే లేదు. "స్త్రీసాహసం", "ప్రేమ", "పరదేశి" వరకూ ఇంకా అర్భకత్వం వీడనట్టు కనిపించిన నాగేశ్వరరావు, ఆ తరవాత చాలాదూరం ప్రయాణం చేశాడు. మొత్తం మీద చూస్తే, హిందీ "దేవదాసు"లో నటించిన సైగల్ చూపినంత సౌలభ్యం, సహజత్వం చూపలేకపోయినా, ఇప్పటి తెలుగు నటులెవరూ నటించలేరనిపించే విధంగా ఆయన నటించాడు.

తరవాత పేర్కొనవలసినది లలితని. చంద్రముఖి పాత్రకు చివరిదాకా ఎవర్ని బుక్ చేయడమా అని ఆలోచించి వినోదా వారు సరియైన తారనే బుక్ చేశారు. 'గ్లామర్'కు పేరుపడిన తార అయినా, లలిత ఈ చిత్రంలో చాలా ప్రతిభతో '*Restraint*'తో నటించింది. అలాగే సావిత్రి కూడా పార్వతి పాత్ర నిర్వహించడంలో ఎవరూ ఆశించనంత నైపుణి చూపింది.

మిగతావారిలో పేకేటి శివరాం నటన కూడా "గుమాస్తా" "కన్నతల్లి" చిత్రాల్లోకంటె అభివృద్ధి కనపరచింది. రంగారావు, సి. ఎస్. ఆర్., ఆరణి, జి. వి. జి. కృష్ణమున్నగువారు తమ పాత్రలు వీలిచ్చినంత వరకూ బాగానే నటించారు. కాని ఉపనటీనటులమీద దర్శకుడు ఎక్కువ శ్రద్ధ తీసుకోనట్లు కనిపిస్తుంది.

సముద్రాలవారి సంభాషణలు 'స్టేజీ'గా ఉన్నప్పటికీ కథకు తగిన గాంభీర్యంతో నడిచాయి. గేయాలుమాత్రం బొత్తిగా బాగా లేవని చెప్పవలసి వస్తుంది. సన్నివేశాలకు ఏమాత్రం సహాయకారులుగా లేక, ప్రేక్షకులకు అర్థంతోచని ధోరణిలో ఉన్నాయి. మన సినిమాపాటలు ఇప్పుడప్పుడే బాగుపడేటట్టు తోచదు. అక్కర్లేనిచోట పాట ప్రవేశపెడితే రక్తి కట్టదనీ, కథ నిలిచిపోయి విసుగుపుడుతుందనీ మన నిర్మాతలెందుకు గ్రహించరో తెలియదు. హిందీ "దేవదాసు"లో సైగల్ పాడిన మూడు పాటలూ సన్నివేశాలకు బాగా అతికాయి. సంగీతంలో కూడా వైవిధ్యం తక్కువ. ఒక్కటంటే ఒక్కటే పాట - దేవదాసు వీధిలో తాగి పడివుండినప్పుడు పాడినది, ('జగమే మాయా, బ్రతుకే మాయా') సంగీ-



"పల్లెపడుచు" లో మారువేషంలో వున్నది జెట్టివుగా సీతారామయ్య, రంగయ్యగా ముక్కామల, క్రాక్ కామేశంగా ఎల్. ఎస్. మణ్యాం.

రోగగ్రస్తురాలైన తల్లి శారదను (సులోచన) చుట్టుముట్టిన పసిబిడ్డలు.
**వాస్తవిక చిత్రం "నన్హే మున్నే" (హిందీ)లో ఒక ఘట్టం.**

దృష్ట్యా హృదయంగమంగా వుంది. ఏమైనా సైగల్ పాడిన పాటలతో ఈ పాటల్ని పోల్చలేము. సైగల్ అమృత సంగీతం కంఠంలోనుంచి కాక గుండెల్లోంచి వెలువడుతున్నట్లుంటుంది.

టెక్నికల్‌గా "దేవదాసు" సామాన్యంగా వుంది. బి. ఎస్. రంగాగారు కెమేరాను కదల్చడంలో చాలా తెలివితేటలు, స్వేచ్ఛ చూపినప్పటికీ, లైటింగ్‌లో మాత్రం కొంత కృత్రిమవిధానాలు అవలంబించారు. నేటికాలపు ఒకానొక ధోరణి ఆయనకు కూడా అలవడిపోయినట్లుంది. మంచి గంభీరమైన సన్నివేశాల్లో అసహజమైన లైటింగ్ యిచ్చారు. ఒక్కొక్కసారి దేవదాసు ఎక్కడికి వెడితే అక్కడికి కొన్ని లైట్లు తెచ్చుకుని, స్తంభాల చాటునో, చెట్లచాటునో తనే అమర్చుకున్నట్టు, ఒకే రకమైన లైటింగ్ పద్ధతి అతన్ని విడవకుండా అనుసరించింది. రికార్డింగ్ బాగానే వున్నది. ఎడిటింగ్ చాలా సాఫీగా, ఎట్టికప్పగంతులూ లేకుండా సాగింది.

సెటింగులు బాగావున్నాయి కాని రావులపల్లె జమీందారు భవనం బయటి దృశ్యం లోపలిదృశ్యానికి సరిపడినట్లు లేదు. బయటిభాగం పెంకుటింటికి సంబంధించినట్టుంది.

లలిత చేసిన రెండునృత్యాలూ చాలా హాయిగా వున్నాయి.

చిత్రం మొత్తంగా తీసుకున్నప్పుడు మిగతా తెలుగుచిత్రాలకూ దీనికీ చాలా తేడా కనిపిస్తుంది. మన నిర్మాతలు కాస్త సందుదొరికితే చాలు, ప్రజాభిరుచుల పేరిట కొన్ని అవాంఛనీయాంశాలు చొప్పించుతారు. "దేవదాసు"లో సెక్స్ అప్పీలుకు తావిచ్చే ఘట్టాలున్నప్పటికీ ఆ జోలికి పోలేదు. వేశ్యావాటికవాతావరణం కోసం ఎంత చెత్తయినా చూపించవచ్చు. అలాగే దేవదాసు తాగుడు ఘట్టాల్లో ఎంత అసభ్యాంశాలైనా చొప్పించవచ్చు. కాని తాగుడు ఘట్టాలన్నీ చాలా నిగ్రహంతో ప్రదర్శించారు. దేవదాసు పతనం శక్తివంతంగా కనబడడానికి కారణం నిగ్రహంతో కూడిన దర్శకత్వమే.

ఏదైనా ఉత్తమ సాహిత్య ఖండాన్ని ఆధారంగా తీసుకొని చిత్రం తీయగోరే వారికి "దేవదాసు" చిత్రం మార్గదర్శకం కాగలదు. మూలంలో పెద్ద మార్పులేమీ చెయ్యకుండా, మూలంపట్ల శ్రద్ధాభావంతో చిత్రంతీస్తే అది అపజయం పొందనవసరం లేదు.



తొలిచంద్రకలను కోలుపోయి అన్నెము పున్నె మెరుగని పసిప్ర... లోకంలో విహరించిపోయిన ప్రశాంతం)—"స్నేహము"

## కీ. శే. బలిజేపల్లి లక్ష్మీకాంత కవి

నాటక రచయితగా, సినిమా రచయితగా, నటుడుగా గణుతికెక్కిన శ్రీ బలిజేపల్లి లక్ష్మీకాంత కవిగారు ఈనెల ఒకటో తేదీన, కాళహస్తిలో కాలధర్మం చెందారు. వీరికి 72 ఏళ్ళ వయస్సు. స్వస్థలం గుంటూరు. ఉత్తర-గోగ్రహణం, సత్యహరిశ్చంద్ర, బుద్ధిమతీవిలాసము, సాత్రాజితీ పరిణయము మొదలైన స్టేజి నాటకాలు వ్రాసి ఖ్యాతిగడించారు. సినిమాల్లో ప్రవేశించి వరవిక్రయం, మళ్ళీపెళ్ళి, తాసిల్దార్, బ్రహ్మరథం, భీష్మ, నా చెల్లెలు మొదలైన చిత్రాల్లో నటించారు. చాలా చిత్రాలకు సంభాషణలు, పాటలు వ్రాశారు. వారి ఆఖరిచిత్రం వై. వి. రావుగారు తీసిన "మంజరి." ఈ చిత్రానికి ఆయన పాటలు రాయడమే కాక, ఒక చిన్న వేషం వేశారు కూడాను. వీరి మృతితో తెలుగు సినిమా రంగంలో ఒక అనుభవజ్ఞుడైన రచయిత లేని లోటు ఏర్పడింది. వీరిఆత్మకు శాంతి కలుగుగాక. 

## నభూతో నభవిష్యతి

"అజంతావారి "వయారిభామ" ఒక విధంగా అపూర్వ చిత్రం. ఇటువంటి చిత్రం ఇంతవరకూ రాలేదు; ఇకముందు రాగలదని నమ్మకమూ లేదు.

వన్‌మిలియన్ బి. సి. లో, అంటార్కిటిక్ భూభాగంలో తీయవలసిన చిత్రం అంటే నమ్మడం కష్టం కాదనుకుంటాను.

చిన్నపిల్లలు "పాతకథలు వద్దు; ఏదన్నా కొత్తకథ చెప్ప"మంటారు. కథ చెప్తే వాడికి ఏమిటో ఏక అప్పటి కేది తోస్తే అదల్లా కల్పించి చెబుతాడు. అలాగే వుంది "వయారిభామ" కథ. దర్శకుడు ట్రీట్‌మెంటు సరిగా రాసుకోకుండా, స్క్రిప్టు లేకుండా ఆశుధారగా చిత్రం యావత్తూ డైరెక్టు చేసినట్టు అనిపిస్తే అది మన తప్పు కాదు.

ఈచిత్రం ఇతర జానపద చిత్రాలమీద 'సెటైర్' అని అరగంటకొకసారి జ్ఞాపకం చేసుకుంటూ చూసినప్పటికీ, రాజేశ్వరరావుగారి సంగీతం ఫరవాలేదని భావిస్తూ చూసినప్పటికీ, మన విసుగుదల అణుమాత్రమూ తగ్గదు. పైగా అరాజకంగా వున్న సౌండ్ రికార్డింగ్‌తో, చెవులు గింగురు లెత్తించే దుర్భర నేపథ్య సంగీతపు అపశబ్దాలతో, హాలునుంచి ఇవతలికి, శ్రీ శ్రీ రాసినట్లు "ఊపిరిపట్టగలమా? గాలి పీల్చగలమా?" అనిపిస్తుంది

సెటైర్ అని మనకి అప్పుడప్పుడు జ్ఞాపకం వచ్చినట్లే, కథకుడికి కూడా



దెయ్యం వదలించడానికి వచ్చాడు భూతవైద్యుడు.

ప్రకాష్ వారి "బూరెల మూకుడు"లో శ్యామల, కుందూ.

జ్ఞాపకం వచ్చి, పాతాళభైరవి మీదా, గుణ సుందరిమీదా, మద్రాసుముఖ్యమంత్రి మీదా, ప్రజాస్వామ్యంమీదా బాణాలు వెయ్యడం జరిగింది. సముద్రంలో కాకి రెట్టలాగ, చిత్రంయొక్క 'మీడియో క్రిటీ'లో ఈ బాణాలు మునిగిపోయాయి.

ఈ చిత్రంలో కథ ప్రబంధసుందరుల నడుముకంటే చిన్నది. సెల్యులాయిడ్‌తో ఎన్ని చీరలు కట్టినా దానికి కథ ఆకారం రాలేదు. ఇందులో డిండిం అనే పాత్ర వున్నది. ఆమె తెలుగుభాషను తలకిందులు చేసి మాట్లాడుతుంది.

"వయారిభామ"ను వర్ణించడానికి తెలుగు భాష చాలదు; డిండింభాష నేర్చుకోవాలి.

"ఒక బాధితుడు" ★

## సినిమా వార్తలు

సొసైటీ పిక్చర్సువారి "ప్రపంచం" ఈ నెల 10-వ తేదీన ఆంధ్రలో విడుదల అయింది. ఎనిమిదవ తేదీన తమిళచిత్రం, తొమ్మిదవ తేదీన తెలుగుచిత్రం పత్రికా ప్రతినిధులుయావన్మందికీ కాసినోలో చూపించారు. ప్రదర్శనానంతరం వుడ్‌లాండ్స్‌లో పెద్దవిందు కూడా చేశారు.

పాతిక లక్షలు పైగా ఖర్చుచేసి, ఇదివరకెవరూ చేయనంత పబ్లిసిటీచేసి సింహళ వర్తకుడు ఎమ్ హెచ్ ఎమ్ మూనాస్ గారు దేశంమీదకు వదిలిన ఈ బ్రహ్మాండ చిత్రం ప్రేక్షకులకు ఒక వింత అనుభవంగా ఉంటుందని అనుకుంటున్నారు

* * *

శ్రీ పి టి సంబంధం చెట్టిగారు పి టి ఎస్ పిక్చర్స్ అనే పేరుతో ఒక సినిమా కంపెనీ స్థాపించారని తెలుస్తున్నది వీరు తెలుగు, తమిళ భాషల్లో ఒక సాంఘిక చిత్రం తీయనున్నారట

* * *

శ్రీ వై వి గారు చాలకాలంగా నిర్మిస్తున్న "మంజరి" ఈనెల 17 న విడుదల చేయనున్నారట

* * *

సొసైటి వారి "ప్రపంచం" లో నర్తకి కుమారి కమల



# ★ ప్రశ్నలు - సమాధానాలు ★

శ్రీ కమ్మపర్తి విఠల్‌రావు—నెల్లూరు.

"దేవదాసు"లో ప్రాముఖ్యతైన దేవదాసు చేత రాగ, తాళములతో కూడిన మూడు పాటలను పాడించటం అసహజంగా ఉందంటారు. మీ రేమంటారు?

—అసలు సినిమాలలో పాత్రలచేత రాగ తాళాలే కాకుండా, బోలెడు నేపథ్య వాద్యాలతో సహా పాటలు పాడించడమే అసహజం. అందుచేత "దేవదాసు" లో కొత్తగా వచ్చిన అసహజత్వం ఏమీ లేదు. మన సినిమాలపై పూర్వపు నాటకాల ప్రభావం పోలేదు. అందుకనే ప్రతి సినిమాలోను పాత్రలచేత పాటలు పాడిస్తారు. ఇంగ్లీషు సినిమాల్లో చూడండి, సంగీత చిత్రాల్లో తప్ప మామూలు వాస్తవిక చిత్రాల్లో ఒక్క పాట కూడా ఉండదు.

* * *

శ్రీ జి. ఎస్. జేవర్—తెనాలి.

"మానవుడు మనో వేదన కప్పిపుచ్చుకొనుటకు మద్యము సేవించుచున్నాడు"అని దేవదాసు చిత్రం నిరూపించుచున్నది కదా! ఎందుకు మరి మద్యపాన నిషేధము ప్రభుత్వమువారు ఆచరణలో పెట్టిరి?

—"దేవదాసు" నిరూపించింది అది కాదనుకుంటాము. మద్యపానంవల్ల మనో వేదన తగ్గినట్లు తాత్కాలికంగా అనిపించినా, నిజానికి మనస్సే కాక దేహంకూడా చెడిపోయి చివరికా మనిషి నశిస్తాడని నిరూపించబడింది. కనుక ఈ చిత్రం ద్వారా మద్యనిషేధానికి అనుకూల ప్రచారమే జరిగింది.

* * *

శ్రీ హెచ్. శ్రీనివాసరావు—నెల్లూరు.

మీరు '10-6-58' సంచికలో ఒక పాఠకుని ప్రశ్నకు సమాధానమిస్తూ అన్ని లక్షణాలు బాగా ఉన్న సినిమాను 'మీ రెక్కడన్నా చూస్తే చెప్పండి. మేము కూడా చూసి ఆనందిస్తాం' అన్నారు. మరి "షావుకారు, గోపీచంద్ లక్ష్మమ్మ, ద్రోహి, శాంతారాం ఆద్మీ, పడోసి, పర్ఛాయిన్, యాత్రిక్"—యివి ఉత్తమ కళా ఖండాలని అందరిచేత ప్రశంసింపబడలేదా! మరి మీరలా సమాధాన మీయడానికి కారణం?

—మీరు చెప్పిన సినిమాలన్నిటిలోనూ బాగాలేని లక్షణాలు కనీసం కొన్ని అయినా ఉండడంచేత; ఈ ముక్క ప్రతి సినిమాకు కొద్దో గొప్పో వర్తిస్తుంది కనుక.

* * *

శ్రీ పి. వి. ఎస్. చౌదరి—పులివర్తివారి పల్లి.

24-6-58 సచిత్ర వారపత్రికలో నొక ప్రశ్నకు జవాబు చెపుతూ "ఎవ రెక్కువుంటే నేం, మద్రాసు మనకు రాకుండా పోయిన తరువాత?" యని జవాబిచ్చియున్నారు. మద్రాసు తగాదా యింకా పరిష్కారము కాలేదు కదండీ? కాన మీ జవాబు చూడ మనమై అరవలకు త్రోవ చూపుచున్నట్లుంది. ఏమంటారు?

—మద్రాసు సమస్య ఇంకా పరిష్కారం కాలేదని మీరు నమ్ముతూ ఉండడం సంతోషించదగినదే. రావణాసురుని కాష్ఠం ఇంకా కాలుతోందంటే నమ్మేవాళ్ళూ ఉన్నారు, నమ్మని వాళ్ళూ ఉన్నారు.

* * *

శ్రీ వి. డి. జయపాల్—బద్వేలు.

పాన్‌షాట్, మీడియం క్లోజప్ అనగా నేమి?

—కెమేరాను ఉన్నచోటినించి కదల్చకుండానే ఎక్కువ దృశ్యం చూపేందుకోసం యిరుసుమీదనే పక్కలకు తిప్పుతారు. దీన్నే పాన్‌షాట్ అంటారు.

—క్లోజప్‌కంటె కొంచెం పెద్ద దృశ్యం చూపేదాన్ని మీడియం క్లోజప్ అంటారు.

* * *

శ్రీ వి. సత్యనారాయణ—రామచంద్రపురం.

శ్రీనాథకవి ఆంధ్రకవులలో పేరెన్నికగన్న మహాకవి అనుట కలదు. కాని శ్రీనాథ కవీశ్వరునియొక్క యింటిపేరు తెలిసియున్నవారు చాల అరుదు. వారి యింటి పేరు చెప్పెదరా?

—శ్రీనాథుని యింటిపేరు నిర్ధారణగా తెలియడంలేదు. శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రిగారు యీ విషయమై పరిశోధన చేశారు "కాల్పట్టణ" నివాసి శ్రీనాథుడు అనే వివరం వారికి తెలిసింది. అందువల్ల ఊరిపేరే వారి యింటిపేరుగదా అని ఎంచినట్లయితే, "కాల్పట్టణ శ్రీనాథుడు" అని చెప్పవలసివచ్చును. "కల్పటపు"వారు అను నియోగి వంశీకులు నేటికిని ఆంధ్రదేశంలో ఉన్నారు. ★

# ★ అన్నయ్యా మనవాడే ★

(25-పేజీ తరువాయి)

"ఇంతలో మీ అన్నయ్య ఆఫీసునుంచి వచ్చాడు. చురచురా నన్ను చూస్తూ లోనకు వెళ్లిపోయాడు. ఎప్పుడు భోంచేశాడో ఏమో తిరిగి జోళ్ళు తొడుక్కుని చరచరా బయటకు వెళ్ళిపోయాడు.

"చిన్నతనంలో తల్లిపోయినప్పటినుంచి తల్లయినా, తండ్రియినా, నేనే అయి ప్రేమతో పెంచాను. పెద్దవాణ్ణి చేశాను. తిరిగి వివాహంచేసుకుంటె పిల్లలకేం లోటు వస్తుందో అని మీసౌఖ్యంకోసం, నాసౌఖ్యాన్ని మరిచాను. పెద్దకొడుకు ఉద్ధరిస్తాడన్న ఆశతో, కష్టపడి చదివించాను, వివాహంచేశాను.

"ఇవన్నీ తెలుసున్న మీ అన్నయ్య, ఈనాడు తనభార్యముందు అస్వతంత్రుడు! వాడిదృష్టిలో భార్య ఒక దైవం! భార్యవాక్కు వేదవాక్కు!!

"నా ఆశలు నిరాశలైనందుకు విచారించను. ఉద్ధరిస్తాడన్న కొడుకు అసహ్యించుకొన్నందుకు విచారించను. రెక్కలాడినంత కాలం ఒకరిమీద ఆధారపడ నవసరం లేదు. కొడుకు ఎక్కడో ఒకచోట ఆనందంగా బ్రతుకుతున్నాడంటే తండ్రి సంతోషిస్తాడు. ఫలానా వారబ్బాయి పట్నంలో ఉద్యోగంచేస్తున్నాడని నలుగురూ అనుకుంటూంటె అదే పదివేలని మురిసిపోయేవాణ్ణి. అంతకంటె నాకు వేరే కొరతగిందేమీ లేదు.

"అబ్బాయీ! పెళ్లికానంతవరకేతల్లైనా, తండ్రయినా, అన్నయినా, తమ్ముడైనా, ఆతరువాత అలివంకవారు ఆత్మబంధువులు; తనవైపువారంటె తగని అసహ్యం! ఇదీ యిప్పటి లోకపుతీరు!

"చూసీ చూడనట్లు చరచరా వెళ్ళిపోయాడుకాని 'ఎప్పుడొచ్చావ్ నాన్నా?' అనలేదు. ఎలావున్నావ్ నాన్నా' అనలేదు. చివరకు భోంచేశావా నాన్నా?' అనలేదు. మానవత్వానికి దూరమై, పశువుకంటె హీనంగా ప్రవర్తించాడు. నేనిప్పుడనుభవించేబాధ, నువ్వొక తండ్రివై, నీకొడుకు కూడా యిలా ప్రవర్తించినపాడుకాని నీకూ అర్థంకాదు.

కన్నకొడుకే యింతకర్కశంగా ప్రవర్తిస్తే పరాయిదైన కోడలికి అపేక్ష ఎలాగొస్తుంది?"—

నాన్న ఈమాట అంటున్నప్పుడు ఆ లోతుకుపోయిన, ఎఱ్ఱటికళ్లనుంచి, కన్నీటి బిందువులు ముత్యాల్లా రాలాయి. "పెళ్లినా నీగౌరవం వాళ్లు కాపాడలేరు. తరువాత నీయిష్టం"—నాన్న చెప్పిన ఈచివరిమాట నాచెవుల్లో గింగురుమంటూంది.

—నాన్న చెప్పినదంతా ఒక్కసారి నాదృష్టిపథంలో గిఱ్ఱున తిరిగింది.

—టైమ్ చూశాను ఒంటిగంటయ్యింది. వదిన అప్పటికీ బయటకు రాలేదు. కోపం శరీరాన్ని దహించివేస్తోంది. అన్నయ్య కనిపిస్తే ఒక్కసారి గట్టిగా ఏమేమో అడగా అనిపించింది.

అంతలోనే మరో ఆలోచన. అన్నయ్యతో ఘర్షణపడటం అనవసరమనిపించింది.

అంతలోనే మరో ఆలోచన: అన్నయ్యతో ఘర్షణపడటం అనవసరమనిపించింది. నాన్నమాటలు పెడచెవిని పెట్టి వచ్చినదాని ఫలితం. నన్ను నేను ఒక్కసారి నిందించుకున్నాను.

అన్నయ్య వచ్చే వేళయింది. ఒకవేళ వచ్చినా జరిగేదేమీ లేదు. నాన్నకు జరిగినట్లే నాకూ తప్పదనుకున్నాను. అందుకే మెల్లిగా జారుకోవటం మంచిదనుకున్నాను. ట్రాయరుపై లెదర్‌బాగ్ తీసుకుని చరచరా బయటకొచ్చి స్టేషన్‌దారి పట్టాను.

నేవెళ్లేటప్పటికి స్టేషన్‌లో రైలురెడీగా వుంది. టికెట్ తీసుకుని పెట్టెలో యెక్కాను. ఇంతలో 'గార్డు' విజిల్ కూడా ఇచ్చాడు.

దూరాన్నుంచి అన్నయ్య అనుకుంటాను...అవును ... అన్నయ్యే ... చెమటలు కక్కుకుంటూ పరుగెత్తుకొస్తున్నాడు. నన్ను చూసి ఒక్కసారి 'గోపీ!—'అన్నాడు. నే మాట్లాడలేదు......

"ఒరేయ్! గోపీ! దిగరా"—అన్నాడు గట్టిగా అన్నయ్య. ఇంతలో బండికదిలింది. ఒక్కసారి నాకండ్లనుంచి జలజలాకన్నీరు కారింది. 'గోపీ!...గోపీ!' — అంటున్న అన్నయ్య పిలుపులు రైలు శబ్దంలో కలిసిపోయాయి—

* * *

వైశాఖ మాసంలో ఒకరోజు, మధ్యాహ్నం 12 గంట లవుతోంది. ఎండ తీక్షణంగా వుంది. వేడి గాడ్పులు గట్టిగా విసురుతున్నాయి. ఇంటిలో పిట్ట కూడా బయటకు రావటంలేదు. వీధి నిర్మానుష్యంగా వుంది.

నాన్న చెమటలు కక్కుకుంటూ అప్పుడే పొలాన్నుండి వచ్చాడు. నేను వరండాలో కూర్చుని చదువుతున్నాను.

ఇంటిముందు బండాగిన శబ్దం, లేచి చూశాను. రెండు బళ్లు వీధిలో నిలబడ్డాయి. బండ్లనిండా సామాను, చివరి బండి వెనకాల అన్నయ్య. నాన్నా, నేనూ ఒక్కసారి నిర్విణ్ణులయ్యాం.

ఎవరూ...? అన్నయ్యేనా?... కారుతున్న చెమట, రేగిన జుట్టూ, చిరిగిన షర్టు...నాకనుమాన మొచ్చింది. చూశాను. అవును!...అన్నయ్యే...మరి ఎందుకిలా తయారయ్యాడు? అయినా ఎందుకిలా వచ్చేశాడు?

అన్నయ్య నాన్న రెండు చేతులూ పట్టుకుని చంటి పిల్లాడిలా 'భోర్' మన్నాడు. నాన్న కండ్లమ్మట అప్రయత్నంగా వచ్చిన కన్నీరు అన్నగారు చేతులమీదుగా జారిపోయింది. వదిన బండి దిగలేదు. సిగ్గుతో అలాగే బండిలో కూర్చుంది. అచేతనావస్థలో నే నలాగే శిలా ప్రతిమలా నుంచుని వాళ్లిద్దరిని చూస్తున్నాను.

ఆతరువాత తెలిసింది. అన్నయ్య దుబారా ఖర్చులపాలంగా ఆఫీసు డబ్బు వాడుకోవటం, పై అధికారి 'చెకింగ్'కు రావటం, ఆ తరువాత అన్నయ్యకు 'డిస్‌మిస్' ఆర్డర్సు చేతికి రావటం!

అన్నయ్యలా నాన్న అసహ్యించుకోలేదు. ప్రేమతో ఓదార్చాడు. 'శరీరంలో శక్తి వున్నంత కాలం తిండికి లోటుండదు. ఇన్నాళ్ళూ పోషించలేదూ, అలాగే. అధైర్యపడకు' అన్నాడు నాన్న. అన్నయ్య పరిస్థితి తల్చుకుని, విధిగా రెండు కన్నీటిచుక్కలు విడిచాను. అంతకంటే ఏమి చెయ్యగలను? ★

# ★ కాలక్షేపం ★

విసువువిరామంలేక విమానాలు విఘడియకొకటి దిగుతూ లేస్తూ ఉంటాయి. అన్నసత్రాలు లాగున అంతులేని ఆస్పత్రులు. అన్నంలేనివాడు సున్న - అన్నం లేనివాడు లేడు సరిగదా! "రామచంద్రా!" అనేవాడు ఆ రాజ్యంలో త్యాజ్యం. అష్టయిశ్వర్యాలతో తులతూగుతున్న అమెరికా వంటి భూతలస్వర్గం చూస్తే నేచాలు మనకు కడుపు నిండుతుంది.

రష్యావంక చూడండి. అక్కడ పనిలేని మనిషి లేడు. కూడు గుడ్డలేని కూలివాడు లేడు. చేతినిండా పని-కడుపునిండా తిండి. కంటినిండా నిద్ర - జేబునిండా రూబుల్సు- (రష్యను నాణెం) - అక్కడ "అన్నమో!" అని ఆర్తనాదం చేసేవాడు లేడు. బహుశః పసిబిడ్డలుకూడా తల్లి పాలకోసం ఏడ్వరు. రష్యనులకు లోటు లేదు. రష్యాకు సాటి లేదు. దేశం అంతా సుభిక్షం. భిక్షమెత్తెడి బిక్క బైరాగులు ఎక్కడా కన్పించరు. అది సన్యాసిదేశం కాదు. అది సామ్యవాదుల రాజ్యం. దేశంలో ఉన్న పాడిపంటలకు ప్రజలందరూ సమాన భాగస్వాములు - సమాన భోగస్వాములు. ద్వాదశ వర్షక్షామములు అక్కడ లేవు. దేశం అంతా నిత్యద్వాదశి. ఏకాదశి అనేది కమ్యూనిస్టు పంచాంగంలో కన్పించదు. కంటి యెదుట కన్పించేది సుత్తి కొడవలి. దానికిపైన తల ఎత్తి చూచినా, అంతకు పైన ముక్తి యింకొకటి కన్పించదు. కమ్యూనిస్టు విశిష్టాద్వైత భూతలస్వర్గంయిది.

కాని, భారతదేశం యీ స్వర్గానికి యింకా ఎక్క లేదు. అసలు ఉట్టికే ఎక్క లేదు. కనుక స్వర్గానికి చాలాదూరంలో ఉంది. కాని, "విభూతిర్భూతి రైశ్వర్యం" అని అర్థం చెప్పిన అమరకోశం భారతీయులకు నిఘంటు ప్రమాణం. "విభూతి" అంటే "అయిశ్వర్యం" అని అన్వయించినది యీ దేశం ఒక్కటే. త్యాగం అనేది ఎక్కడ ఉంటుందో, భోగం అనేది ఎక్కడ భస్మమైపోతుందో, ఆ విభూతిభస్మమును దాల్చిన యోగు లెక్కడ ఉంటారో, అదే కైలాసం. అటువంటి కైలాసంలో కేళీవిలాసంగా విహరించే పరమహంసలు మంత్రించియిచ్చిన విభూతి విస్తారంగా ఉంది భారతదేశంలో. సమరంలేకుండా సంస్థానాధీశులు సంస్థానాలను త్యాగం చేయడం స్వల్ప విషయం కాదు. లక్షలకొలది యకరాల భూమిని త్యాగం చేసి భూదానయజ్ఞం చేయడం, అజ్ఞానంచేత కాదు. స్వర్గానికి పైది మోక్షం అనే లక్ష్యం మహాత్ములు పెట్టిన భిక్ష మనకు. దేశం భూతలస్వర్గం కావాలంటే, యిదిగో సూత్రం అని మహాత్ముడు తన చేతితో నూలు వడికి చూపించాడు. ఫ్యాక్టరీల పొగ మనకు విభూతి కాదన్నాడు. ఆవిరియంత్రంలో మన ఆత్మశక్తి ఆవిరైపోతుందన్నాడు. ఆ బొగ్గు బాయిలర్లకున్న దాహం ధనదాహంగా, సామ్రాజ్య దాహంగా, సమర దాహంగా తయారవుతుందన్నాడు.

సంగ్రామాలు సంభవించకూడదంటే గ్రామాలు స్వయం సమర్థంగా వృద్ధిలోకి రావాలన్నాడు. సర్వజనసుభోదయ మార్గంగా సర్వోదయసమాజం స్థాపించాడు. స్వర్గంగాని దేవేంద్రభోగంగాని, మోక్షంకంటె ఎక్కువైనది కాదన్నాడు. ఆయన కోరింది భారత జాతిమోక్షం. దేశం సుభిక్షమైతే చాలదు. ప్రాజెక్టులు పంచవర్ష ప్రణాళికలు చాలవు. దేశంలో యుద్ధబీజాలు లేని వృద్ధి కావాలి. సుభిక్షానికి మించినమోక్షం ఆత్మశాంతి - దేశశాంతి- లోకశాంతి - "శాంతమూ లేక సౌఖ్యమూ లేదు" అనేమాట త్యాగబ్రహ్మలు మాత్రమే ఆలాపన చేయగలరు. శాంతివల్ల కలిగేది సౌఖ్యమేగాని భోగం కాదు. "భోగమ్ములు" అనేది సంస్కృతం.- దానికి తెనుగులో "పాము పడగలు" అని అర్థం - భోగమ్ములు అనుభవించే మనుజులు, ప్రజలుకూడా ఆ "భోగముల" క్రింద "సప్పంబు పడగనీడను గప్పవసించు విధము"గా, ముప్పుల చప్పరంలో హుక్కా త్రాగుతూ చక్కని తెప్ప మీద తేలిపోతున్నారని గ్రహించాలి. అటువంటి "భోగమ్ములు పుణ్యవంతులకు గాని లభింపవటండ్రు"—నిజమే. "లభింపవటండ్రు"—ఎవరు? నిజానిజము లెరుంగని ప్రజానీకము. ★



ఆబోతుల పోరాటం
—ఫొటో: శ్రీ యం. చంద్రశేఖరం, రాజమండ్రి.

మేస్టారు:- ప్రాణవాయువు లేకుండా, ఈ విశాల ప్రపంచంలో ఏ జీవీ బ్రతకదని, సుమారు 300 సంవత్సరాల క్రితం కనిపెట్ట బడింది.

ఒక కుర్రాడు:- ఐతే ఆసంగతి కనిపెట్టబడటానికి ముందు ఈ ప్రపంచంలో జీవరాసులు ఎలా జీవించి వుండేవండీ?

"మహేష్"

* * *

జ్యోతిష్కుడు:- మీ భార్యకూ మీకూ నాలుగేళ్ళ దాకా దెబ్బలాట లుంటూనే వుంటాయి.

ఆయన:- ఆతరువాత దెబ్బలాటలు రావా?

జ్యోతిష్కుడు:- వస్తాయి; అలవాటైపోతుంది కనుక భయంలేదు.

శ్రీ సిహెచ్. ఎస్ రావు, కాకినాడ

## నేటి మనిషి

(7 వ పేజీ తరువాయి)

అయిపోయి అప్పుకి బయలుదేరాడాయె. ఎట్లా పుచ్చుకోకుండా ఉండగలగడం? ఏది లేదన్నా రోజుకి పెకైసిగరెట్లకి అర్ధరూపాయికి పైమాటేకాని తక్కువకాదు. పోనీ అనవసరపు ఖర్చులు తగ్గిస్తే? సిగరెట్లు ఎలాగా తప్పవు. సినీమాలు తగ్గిస్తే తనకూ, శ్రీమతికీ అసలు జీవితమే నిష్ప్రయోజనం అనిపిస్తుందాయె. అతనికి ప్రతీదీ అత్యవసరపు ఖర్చులాగే కనిపించింది. ఆలోచిస్తున్నాడు.

ఇంతలో "కనకం! ఇక్కడున్నావేంరా?" అని పిలిచారు అతన్ని సమీపిస్తూ ఎవరో వెనకనుంచి. కనకం తలత్రిప్పిచూశాడు. వెంకటేశ్వర్లు! థర్డ్‌యియరు చదువుతుండగా తన రూమ్‌మేట్ - అవును తను మరచిపోయాడు. వెంకటేశ్వర్లు స్టేషన్‌లో "గూడ్సు క్లార్కు"గా పనిచేస్తున్నాడు.

"ఏంలేదురా ఇవాళ సెలవుకదూ!" అన్నాడు కనకం.

"సెలవైతే ఇక్కడెందుకూ ఏ సినీమాకో, ఎక్కడికో పోక?" అన్నాడు వెంకటేశ్వర్లు.

"అబ్బే! లేదులే!" అని నసిగాడు కనకం.

వెంకటేశ్వర్లు కనకం వాలకం పసిగట్టి "యేదైనా డబ్బుకావాలా" అని అడిగాడు కనకం అవసరం గుర్తించినవాడిలా.

"ఊఁ. కావాలి" అనటానికి కనకానికి వచ్చినంత పనైంది. విలాగైతేం వెంకటేశ్వర్లు దగ్గర అయిదూ తీసికొని కనకం మరిఆలోచించకుండా ఆనందోత్సాహ సంరంభంలో రిక్షామీద ఇంటికి చేరుకున్నాడు. వర్తమానస్థితి ఒక్కటే పట్టింది కాని కనకానికి భవిష్యత్తునుగూర్చి కించిత్తు కూడ బెంగలేదు. భవిష్యత్తు ఎప్పుడూ బాగుంటుందనే అతని గాఢవిశ్వాసం.



(17-వ పేజీ తరువాయి)

అడుగుతూంటే ఒళ్ళుమండింది. అందుచేత ఆమె చెంప ఛెడేలుమంది.

కొడుకు చదువుకోసం, ఉన్న ఊరని, సంసారం అక్కడె ఉంచేసి తను కోటి ఫలిలో హోటల్లో తింటూ కాలం గడుపుతున్నాడు సత్యనారాయణ. జానకమ్మ వ్రాసిన ఉత్తరాలు కోపంకొద్దీ చదవనైనా లేదు. మళ్ళీ పేకాట ధోరణిలోపడి యింటి సంగతి తలపెట్టనేలేదు.

"నాన్నా! యింటికి రమ్మంది అమ్మ నిన్ను. చెల్లాయికి యీమధ్య చాలా జ్వరం వచ్చింది. నీకోసం రోజూ పలవరిస్తోంది."

కృష్ణుడి అమాయక ప్రాథేయత చూసి, ఆయన కళ్ళు చెమ్మగిల్లాయి. ఏడుస్తున్న జానకమ్మ ఎదురుగా కనిపించినట్లయింది. తన పదేండ్ల సంసారంలో భార్యపై చేయి చేసుకోడం అదే ప్రథమం, పాపం! ఎంత బాధపడిందో, అనుకున్నాడు.

"బాబయ్యా! ఒక్క కానీ యిప్పించరూ. ఆకలి వేస్తోంది" అంటూ పక్కే కుర్రవాడు చిరిగిన లాగు చొక్కాతో నీరసంగా శివంలా నుంచున్నాడు వీధిలో. సత్యనారాయణ హృదయం కరిగి వాడి చేతిలో అణా వేశాడు.

"నాన్నా! ఆ కుర్రాడు అచ్చు నాలాగే ఉన్నాడు" అన్నాడు కృష్ణుడు.

సత్యనారాయణ మనస్సు చివుక్కుమంది. నిజం. ఆ స్థితిన్నా, తన పేకాట గొడవలో సంసారం సంగతే మరిచిపోయేవాడు తను. పిల్లలకు కావలసినవన్నీ జానకమ్మ చూసుకునేది. ఉన్న ఆరెకరాల ఆస్తి అంతా పేకాటల్లో తగులబెడితే తనకొడుకు తన అనంతరం ఈముష్టి కుర్రాడిలా మారవచ్చు. ఈ ఆలోచన, కృష్ణుడి మాటలు, అతన్ని కలవరపెట్టాయి. సత్యనారాయణ భయంతో వణికి పోయాడు.

"లేదు! నువ్వు అలా లేవు కృష్ణా! ఎప్పటికీ ఉండవు!" అంటూ ఉద్వేగంతో సత్యనారాయణ కృష్ణుడిని కౌగిలించుకున్నాడు. ఆ ఉద్రేకంతో అతని కంటినుంచి బాష్పాలు రాలాయి.

"అదేమిటి నాన్నా ఏడుస్తావెందుకూ!"

"ఏంలేదు అమ్మదగ్గరకు వెళదాంలే" అంటూ బట్టలు సర్దుకుని, కొడుకుని వెంట పెట్టుకుని, జట్కాలో గబగబా బస్సు స్టాండుదగ్గరికి వెళ్ళాడు సత్యనారాయణ. కాని అప్పటికే ఆఖరిబస్సు వెళ్ళిపోయిందని తెలిసింది.

కాని సత్యనారాయణకు ఎలాగైనా ఆరాత్రి యింటికివెళ్ళి పోవాలనిపించింది. ఆఫీసుకువెళ్ళి సైకిలు తీశాడు. కృష్ణుని ముందుకూర్చోబెట్టుకుని, గబగబా కాలువగట్టున శరవేగంతో సైకిలు తొక్కడం మొదలు పెట్టాడు. కృష్ణుడు ఏవేవో అడుగుతూంటే, అతను ఊకొట్టడమే కాని, దృష్టి అంతా జానకమ్మపైనే ఉంది.

రాత్రి పదిగంటలకు యిద్దరూ యిల్లు చేరారు. వీధిలోంచి కృష్ణుడు సైకిలుగంట గణగణ గట్టిగా మోగించాడు. జానకమ్మ తలుపు తెరిచింది. రాత్రిళ్ళు సత్యనారాయణవస్తే అలాగంట మ్రోగించడం అలవాటు. సత్యనారాయణ నవ్వుతూయింట్లో అడుగుపెట్టాడు.

"అమ్మా! నాన్నను తీసుకువచ్చాచూశావా!" అంటూ తన ప్రతాపం వెలిబుచ్చాడు కృష్ణుడు. జానకమ్మ ఆనందంతో ఉప్పొంగిపోయింది. భర్తకు కాళ్ళు కడుక్కొందుకు, స్నానానికి నీళ్లు యిచ్చింది. కొడుకూ తండ్రి అన్నానికి సిద్ధమయ్యారు.

"ఏమండీ! యింకా నామీద కోపం తగ్గలేదా!" అంది జానకమ్మ నవ్వుతూ.

"అమ్మా! నాన్నకూడా ఆ వూళ్లో ఏడ్చాడే! నాన్నకు యిప్పుడు కోపంలేదు" అన్నాడు కృష్ణుడు.

"ఏడిశావు వెధవ" అన్నాడు సత్యనారాయణ నవ్వుతూ.

"ఏం! ఉన్నరహస్యం చెప్పినందుకు ఉడుకుమోత్తనమా!" చిలిపిగా నవ్వింది జానకమ్మ.

"నీ రహస్యాలూ చెప్పాడులే వాడు" పరిహసించాడు సత్యనారాయణ.

"అబ్బ! మీరు యిన్నాళ్లు రాకపోతే రోజులు యుగాలుగా గడిచాయండి" అంటూ జానకమ్మ ఒళ్లు విరుచుకుని ఆవలించి, నవ్వింది

తెల్లనిచీర కట్టుకుని, చీకటిమించిన తెల్లని మల్లిపూలు తల్లో ముడిచి, మల్లెపూలకు మించిన తెల్లని నవ్వుల వెల్గులు జానకమ్మ పెదవులమీద కురిపించగానే "ఉహు" అంటూ సత్యనారాయణ ఆమె బుగ్గమీద చిటికి వేశాడు.

"ఏమిటిరా ఆ వెకిలినవ్వు" అని కేకలేసింది జానకమ్మ

"ఎందుకే వాడిమీద కోపపడతావు. వాడు నీ రాయబారి కదూ!" అన్నాడు సత్యనారాయణ పరిహాసిస్తూ.

★

(19 వ పేజీ తరువాయి)

మనోదౌర్బల్యం, మందబుద్ధి ఎంత ఘోర పాపానికి దారితీసింది? ఈ క్షమించరాని తప్పిదాన్ని భగవంతుడు సహింతం సహిస్తాడా, క్షమిస్తాడా? 'ఆ అమ్మాయి ఈ వూళ్ళో వుండకూడదని, కీడని' కళ్ళెర్రజేసిన నంబిగార్ని ముందు అడిగితే మా గురు మాట్లాడనే లేదే? 'ఇది ఎంతపనికి తలపడింది, దీని సిగ తరగ' అన్న పెత్తందారు రత్తయ్యగారు తనకు ఇవ్వవలసిన 50 రు. క్రింద తిండిగింజలు కొలవమంటే లేవన్నాడే?! వీళ్ళంతా దగాకోర్లు, మోసగాళ్లు.

ఇలా తర్కించుకొంటూ వూహాకందని ఆలోచనతో నిద్రలో తుళ్ళిపడుతున్నాడు వెంకయ్య. ఇంతలో వాకిట్లో బండి చప్పుడయింది. కమల ఎదురువెళ్ళింది. భర్త రామారావు, తల్లి సీతమ్మగారు, బండినుంచి దిగుతున్నారు. కమలకు పట్టరాని సంతోష మొచ్చింది. సీతమ్మ కూతుర్ని చూడగానే "ఏన్నాళ్ళకు కనపడ్డావే! అమ్మా నీకెన్ని కష్టాలు వచ్చినాయే! నాకళ్లెంత పాడు... తల్లీ నిన్ను చూడకుండా ఉండలేకపోతూనే ఇన్నాళ్ళు తెలియక ఊరంతా తిరుగుతుంటే మీ ఆయన బండెక్కించుకొచ్చాడు. నేనిక్కడికి దొంగచాటుగా రావాల్సి వచ్చిందే అమ్మా! మీనాన్న నీ పినతండ్రిగారింటికెళ్ళాగు. ఆయన వచ్చేలోగా నేను తిరిగి ఇంటికెళ్లి పోవాలే అమ్మా" అంటూ ఎవరు చెప్పినావినకుండా, ఏడుపు పెడబొబ్బలతో ఇంటి పెంకులెగిరేలా ఏడుస్తుంటే వెంకయ్య త్రుళ్ళిపడి లేచాడు.

"నీ మేనమామగారింటికని చెప్పి నువ్వు ఇక్కడికే వచ్చావ్?" అంటూ నసుగుతూ బయటికి వచ్చాడు. సీతమ్మ సంగీతం టక్కుమని కట్టేసింది "ఇక సరేలే! ... మీ తమ్ముడిగారింటి కెళ్లానన్నారుగా?" అంది ఆశ్చర్యపోతూ. అంతా నవ్వుకుంటూ లోనికెళ్ళారు.

★

Edited, Printed & Published by S. Sambhu Prasad at the Andhra Patrika Press, 7, Thambu Chetty St, Madra



పంచతంత్రం

# సంధి-విగ్రహం

కర్త... విశ్వాత్ముల నరసింహమూర్తి



విజయుడంత బయలుదేరి
గజరాజొచ్చే మార్గంలో
కొండపైన కూర్చుండెను.



శశకము ఆకొండపైన
కొంత తడవు వేచియుండ
కడుబడలిన గజయూథము
తమ నెలవును చేరుటకై
కొలను విడిచి వచ్చుచుండె.



"గజరాజా! జయీభవ! - నిమిష
మిచట నిలిచి నాదు - సందేశము
వినుమోయీ!"

"ఎవరవోయి నీవూ?
ఎవరు పంపినారూ?"



"ఇవని పేరు విని నంతనె - చకోరములు మైమరచునో
- ఆ చంద్రుని దూత నేను. - 'నా అనుమతి లేకుండా
- కొలని నీరు త్రాగినారు. - నా నమ్మిన సేవకులగు -
కుందేళ్లను చంపినారు. - తెలియక చేసిన తప్పుని -
దయతో క్షమియించినాను. - ఇకనైనా బుద్ధి కలిగి -
ఈ స్థలమును విడువరేని - ఇంతటితో మీ ఆయువు
- తీరినదని తెలుసుకోండి!' - అని చంద్రుడు
నా చేతను - సందేశం పంపినాడు!"



"ఆ హరిణాంకుని శక్తుల ముందర - మేమెంతా! మా బ్రతుకెంతా
- తెలియక చేసిన నేరాలన్నీ - సైరించును ఆ చల్లని దేవుడు. - జరి
గిన దానికి పశ్చాత్తాపం - పొందుతున్న మమ్మందరినీ మీ -
రాజుగారికెరుక పరచి - కాపాడుము కుందేలా!"



"మా ఏలిక కరుణానిధి! - తప్పక క్షమియిస్తాడు.
- ఆ కనిపించే సరోవరాన్నే - చంద్రుని సరస్సని
అంటారు. - ఆ కొలనుకు కావలిగా - మమ్ముల
నియమించాడు. - గగన వీధి నెల్లప్పుడు -
విహరించే మా ప్రభువూ - మాపైనా
మక్కువతో - కొలనుకు వెంచేస్తాడు.
అప్పుడు మీ విన్నపమును - మీరే
వినిపించవచ్చు."



అని శశకం
గజరాజుకు -
సంజెవేళ
కాగానే -
కొలని నీట
ప్రతిఫలించి -
కదులుచున్న
సుధాకరుని -
బింబము
చూపించాడు.

"చూచితివా? గజరాజా!
కోపంతో మా ప్రభువూ
కంపిస్తూ వున్నాడు?"

"అయ్యో! ఇప్పుడు ఏమి
చేయుదును? - పోనీ
నీవే ముందుకు పోయీ
- మనసుకు నచ్చే
మాటలు చెప్పి - ప్రభువు
కోపమును చల్లార్చు!"



"నీ మనవిని వినిపించే - సమయం ఇది కాదయ్యా! -
ప్రభువు మనసు శాంతిస్తే - ఆపిమ్మట నీ గురించి -
ఆయన కెరిగిస్తాను... కావున నిక నిశ్చింతగ - నీ
తావుకు మరలవచ్చు - అయినా మరి ఒక్క మాట -
దారి నడుమ ఎదురయ్యే - కుందేళ్లను తొక్కకుండ
- భద్రంగా దాటిపొమ్ము - ఈ విషయం మరచినచో
- మా ప్రభువుల రౌద్రాగ్నికి - మీరాహుతి కాగలరు."




భయభక్తులతో ఏనుగులు
భద్రంగా నడచుకొంటూ
తమ నెలవును చేరాయి.

విజయుడు విజయోత్సాహం
తో చని - శిలీముఖునికి
వృత్తాంతం - ఆసాంతంగా
వివరించాడు

తమకొచ్చిన ఆపదలను
అవలీలగ తప్పించిన
ఆ విజయుని శిలీముఖుడు
కౌగలించుకొన్నాడు.



Regd No. M. 4479

Andhra Patrika Illustrated Weekly.

సిద్ధముగానున్నది.

# విచిత్రవ్యక్తి

మూలం:-

మార్క్ ట్వేన్



అనువాదం:

నండూరి రామమోహనరావు



ప్రతి గొప్ప రచయితా నాటకం రాసినా, నవల రాసినా, కావ్యం రాసినా తన రచనలో తన్ను ప్రతిబింబింపజేసుకుంటాడు. ప్రపంచం మీద తన అభిప్రాయ మేమిటో ప్రత్యక్షంగానో, పాత్రలద్వారానో చెప్పి తీరుతాడు. మార్క్ ట్వేన్ రాసిన నవలల్లో మార్క్ ట్వేన్ పూర్తిగా కనిపిస్తాడు. అతని గొప్పనవలల్లో ఒకటైన "*Mysterious Stranger*" లో సైతాను భాషలో మార్క్ ట్వేన్ మాట్లాడుతూ మానవజాతిమీద, చరిత్రమీద తనకు గల అక్కసునంతా తీర్చుకుంటాడు. ఇప్పటి ప్రపంచ పరిస్థితిలో— మన గత చరిత్రలో గర్వపడాల్సిన కారణాల కంటే సిగ్గు పడాల్సిన కారణాలే ఎక్కు-వగా ఉన్నాయనే సంగతి జ్ఞాపకంచేసుకోవడం కోసం ఈనవల చదివితీరాలి.

## ఆంధ్రగ్రంథమాల

మదరాసు-1